త్వరపడండి !　　　　　　　　　　　　　　　　స్వంతం చేసుకోండి !!

# శ్రీవాణి శత సంచిక ప్రత్యేక సంచిక

## ఏప్రియల్ '93 లో సుమారు 200 పేజీలతో వెలువడుతుంది.

ఈ ప్రత్యేక సంచికలో అనేకమంది ప్రముఖుల సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్య, విజ్ఞాన వ్యాసములు, కవితలు, పద్యములు, పురాణ ఇతిహాస కథలు, ప్రశ్నలు-సమాధానములు, వింతలు-విడ్డూరాలు, మీకు తెలుసా?, ఆణిముత్యాలు, నీతిసూక్తులు, ఇంకా...ఇంకా... ఎన్నో...ఎన్నో...విజ్ఞాన విశేషాలుంటాయి.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి ప్రసంగాలు, సందేశాలు, ఆధ్యాత్మిక ప్రబోధలు వారి మహిమాన్విత దివ్యశక్తిని గురించిన వ్యాసములుంటాయి.

**విడి ప్రతి : రు. 15-00**

చందాలు అమలులో ఉన్న వారికి క్రొత్త చందాదారులుగా వెంటనే చేరేవారికి పై ప్రత్యేక సంచిక పంపబడుతుంది. అదనంగా ఏమాత్రం చెల్లించనవసరంలేదు చందాలు రెన్యూవల్ చేయని వారికి, బకాయిలు ఉన్నవారికి పై ప్రత్యేక సంచిక పంపబడదు.15-3-1993 కల్లా చందాలు పంపిన వారికే ప్రత్యేక సంచికలు పంపబడును.

పారిశ్రామిక వేత్తలు, వ్యాపారస్థులు తమ ప్రకటనలు (Advertisements) పంపి సహకరించ ప్రార్థన.

11-4-1993 ఆదివారం సా॥ 6గం. మచిలీపట్నంలోని ఆదర్శ విద్యాలయంలో **'శత సంచిక మహోత్సవం'** జరుగును. కాన యావన్మంది పాల్గొన ప్రార్థన.

### చందాల వివరాలు

సం. చందా : రు. 48-00

సం. చందా : రు. 175-00

జీవిత సభ్యత్వం : రు. 600-00

( జీవిత సభ్యుల ఫొటోలు ప్రత్యేక సంచికలో ముద్రించబడుతాయి )

పోషకులు : రు. 1116-00

1) ప్రతి నెలా శ్రీవాణి పంపటమే గాక శ్రీవాణి ముద్రించిన పుస్తకాలు కూడా ఉచితంగా పంప బడుతాయి

1. వివేకవాణి, 2. రామాయణపాత్రలు,
3. అమృతవాణి, 4. కనీస విజ్ఞానం

పోషకులకు వెంటనే పుస్తకాలు పంపబడుతాయి.

గమనిక : చెక్కులు అంగీకరించబడవు. M O. లేక D D.ద్వారా చందాలుపంపవలెను

### ప్రకటనలు *(Advertisements)*

| | |
|---|---|
| Back Cover (4th Page) Multi Colours | Rs. 5000-00 |
| Second & Third Cover (Black & white) | Rs. 3000-00 |
| Opening page(Deluxe) | Rs. 3000-00 |
| Full page (Deluxe) | Rs. 2000-00 |
| Full page (Ordinory) | Rs. 1000-00 |
| Half page ( ,, ) | Rs. 500-00 |

N. B. ; Cheques & Drafts should be drawn in favour of 'SREE VAN Monthly, Machilipatnam




సం॥ 8
సంచిక :

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడు పేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818

విడి ప్రతి : రు. 4-00
సంవత్సర చందా: రు. 48-00
4 సం॥ల చందా : రు. 175-00
జీవిత సభ్యత్వం : రు. 600-00
పోషకులు : రు. 1,116/-

Cheques Drafts should be drawn in favour of SREE VANI, Monthly Machilipatnam

EDITED, PRINTED & PUBLISHED BY
iri
Krishna Mohan Rao

Printed at
SREE VANI PRINTERS
MACHILIPATNAM

## విషయ సూచిక



ముఖచిత్రం : సంత్ సమర్థ రామదాసు

# వసంతలక్ష్మి

-కొమరగిరి జయప్రద

" దశ దిశలా వెల్లి విరిసింది వసంతం
పులకరించింది ప్రకృతి సర్వస్వం
మామిడి చిగురులు తిని మత్తెక్కిన
కోయిల కుహు కుహూ నాదాలతో
ఘుమ్మ ఘుమ్మంచు మల్లెల సువాసనలతో
ఝుమ్మ ఝుమ్మంచు తుమ్మెదల
ఝూంకారాలతో
సకల జనులకు మనసు రంజిల్లునట్లుగా
తనదు నేస్తాలతోడ వసంతుడొచ్చె. "

" అహమేవాక్షయః కాలః " అని శ్రీకృష్ణ భగవానుని వచనము. అంటే, అక్షయమైన కాలాన్ని నేను అని అర్థం. కాలం భగవత్ స్వరూపం. కాలం అనంతము. ఆదిమధ్యాంతరహితము ఈ అనంత కాల పరిమాణంలో మానవుని ఆయుఃప్రమాణము సూక్ష్మాతి సూక్ష్మము అయితే ఈ అనంత కాల చక్రంలో తన ఉనికిని గుర్తించటం కోసం ఒక కాలమానం ఏర్పరచారు మన పూర్వీకులు. అదే ఈ సంవత్సరాల సంపుటి అనిపిస్తుంది

ప్రస్తుతం గడచిన అంగీరసనామ సంవత్సరానికి వీడ్కోలు చెప్పి, నూతన సంవత్సరమయిన శ్రీముఖ నామ సంవత్సరమునకు స్వాగతం పలుకుదాము, శ్రీముఖ మనే పేరులోనే సకల శుభాలూ ఉన్నాయి. "శ్రీ" అక్షరం గౌరవప్రదమైనది శుభప్రదమైనది.

మన పూర్వులు మనకు ప్రతి పండుగలోనూ ఒక ప్రత్యేకతను సూచించారు. ఉదా : వినాయక చవితి, గణపతికి పూజ, నిమజ్జనం. శ్రీకృష్ణాష్టమికి ఉట్లు కొట్టటం, దసరాకు జమ్మి కొట్టటం, దీపావళికి దీపాలు పెట్టటం, సంక్రాంతికి గొబ్బిళ్ళుపెట్టటం మొదలయినవి. అలాగే " ఉగాదికి " ఆరోగ్య సూత్రానికి ఆచారం జోడించి ఉగాది పచ్చడిని తీసుకోవాలని పెట్టారు. ఈ పచ్చడి, వేపపూత, చింతపండు, బెల్లం, మామిడి ముక్కలు, ఉప్పు, చెరకుముక్కలు మొదలగు షడ్రుచుల సమ్మేళన. ఈ పచ్చడి తీసుకోవటంవల్ల వాత, పిత్త దోషాలు హరించి, రోగ శాంతి జరుగుతుందని వైద్యశాస్త్రం చెబుతున్నది. ఇది ఆరోగ్యమేకాక, మానవ జీవితంలో కష్టసుఖాల కలయికను గూర్చి కూడా హెచ్చరిస్తుంది. చేదెక్కిన బ్రతుకులలో చెరకుతీపి పండించుకోవాలనేదే ఉగాది సందేశం.

"ఋతూనాం కుసుమాకరః" అంటూ వసంత ఋతువు ప్రాముఖ్యతను సాక్షాత్తు పరమాత్మడైన శ్రీకృష్ణుడే వెల్లడించాడు. శిశిరంలో ఆకులు రాల్చి మోడువారిన ప్రకృతికాంత, వసంతంలో నవనవోన్మేషణమైన క్రొత్త చిగురులతో, నిలువెల్ల పులకరించి పూచిన పూరెమ్మలతో, మామిడికాయలు బరువుతో, వంగిన కొమ్మలతో సర్వాభరణాలు ధరించి నును సిగ్గుతో తలను వంచిన క్రొత్త పెండ్లికూతురిలా వస్తుంది వసంతలక్ష్మి. కాలానుగుణముగా వచ్చే ఉత్సవాలను తెలుపు అగమశాస్త్రమునందు ప్రధానముగా చెప్పబడినది వసంతోత్సవము. ఇది విష్ణు ప్రీతికరమయిన ఋతువు. ఋతువులలో వసంత ఋతువును నేనే అన్నాడు పరమాత్మ.

" చైత్రమాసస్తు దేవస్య
మహాప్రీతికరః కిల
కుర్వంతి మనుజాః ధీశా
వసన్తే దివ్య ముత్సవమ్ "

పై శ్లోకము ప్రకారము దేవదేవునికి ప్రీతికరమైన వసంత ఋతువులో వసంతోత్సవము తప్పక చేయ

వలయును. అందుకే ఏడుకొండలవాడికి ఈ ఉత్సవము అత్యుత్తమంగా జరుపుతారు. అనంతమయిన కాలానికి కొలబద్ద అంటూ ఏమీ లేదు. కానీ మానవ జీవితం, ఏ దేశములో అయినా అనుభవించవలసిన దశలు మాత్రం అయిదు 1. బాల్యం, 2. యౌవనం, 3. కౌమారం, 4 వార్ధక్యం. 5 దేహాంతరప్రాప్తి. ప్రతి పన్నెండు సంవత్సరాలను ఒక "దశ"గా భావిస్తే అరవై దాటేసరికి ప్రతి మనిషి చూపును పైకి ప్రసరించి, ఆలోచిస్తాడు. మన సంవత్సరాల పేర్లలో మొదటిది "ప్రభవ" చివరిది "క్షయ" కనుక ఇహ పర సౌఖ్యాలను కోరుకొనేవారికి, ఈ ప్రభవ, క్షయ, మధ్యకాలమే యోగ్యమయినదన్నమాట.

తెలుగువారు జరుపుకునే పండుగలన్నింటిలోనూ, 'ఉగాది' ముఖ్యమయినది, మొదటిది. మాసములలో మొదటిది, చైత్రము తిథులలో మొదటిది పాడ్యమి. అన్నింటిలోనూ ఆది, కాబట్టి ఉగాది అయినది ఈ పండుగను కేవలం మన రాష్ట్రంలోనే కాక వివిధ ప్రాంతాలవారు విభిన్నరీతులలో దీనిని జరుపుకుంటారు. "తమిళనాడు" లో ఉగాదిరోజున ప్రజలందరూ క్రొత్త బట్టలు ధరించి ఒకరికొకరు శుభాకాంక్షలు తెలుపుకుంటారు పసుపు కుంకుములతో తమ పిల్లలకు దిష్టి తీస్తారు. దానివల్ల సంవత్సరమంతా తమ పిల్లలు ఆయురారోగ్యాలతో ఉంటారని వారి నమ్మకం "బీహార్" లోని ప్రజలు ఉగాదినాడు ఉదయాన్నే నదులలో గాని సరస్సులలో గాని స్నానం చేసి, సూర్య నమస్కారములతో సూర్యోపాసన చేసి, నూతన సంవత్సరమంతా తమకు ఆయురారోగ్యాలను ప్రసాదించవలసిందిగా కోరుకుంటారు. బంధుమిత్రులతో విందులారగిస్తారు. 'పంజాబ్' లో ఉగాదిని 'వైశాఖి' అని పిలుస్తారు. సిక్కు మతగురువైన "గురునానక్" తన బోధనలను ప్రజలకు ఉపదేశించిన రోజుగా దీనిని జరుపుకోవటం ఒక విశేషం. 'మహారాష్ట్ర'లో ఉగాదినాడు ప్రజలు తమ ఇండ్లముందు వెదురుకఱ్ఱల పాతి వాటికి పెద్ద జరీ అంచుగల ఎఱ్ఱరంగు వస్త్రాలను జెండాలుగా కడుతారు. శాతవాహనుల కాలంలో అప్పటి రాజుల గౌరవార్థం ప్రజలు ఈ విధంగా చేసేవారని, ఆ ఆచారం ప్రకారం ఇప్పటికీ ఉగాదినాడు ఈ పద్ధతి కొనసాగుతున్నదని తెలుస్తున్నది. "అస్సాం" లో ఉగాదినాడు ప్రతి వారు తమ ఇండ్లలోని పశువులను, ముఖ్యంగా గోవులను కడిగి బొట్లుపెట్టి పూజిస్తారు. దీనిని వారు గోపూజగా భావిస్తారు. ఈ పండుగను వారు "బిహూ" అని అంటారు.

ఇక మన ఆంధ్రలో ప్రథమ పండుగగా దీనిని వైభవంగా జరుపుకుంటారు. దీనికి కుల మత తారతమ్యం లేదు ఉదయాన్నే తలస్నానం, నూతన వస్త్రధారణ, షడ్రుచులతో మిశ్రితమయిన ప్రసాదం తీసుకోవటం, దేవాలయాలకు వెళ్ళటం, బంధుమిత్రులతో భోజనాలు, సాయంత్రం పంచాంగ శ్రవణం చేయటం "సూర్య శ్శౌర్య మథేందు రింద్రపదవీం" అనే శ్లోకంలో ఉగాదినాడు పంచాంగ శ్రవణం చేసిన వారికి, సూర్యుడు శౌర్యాన్ని, చంద్రుడు ఇంద్రసమాన వైభవాన్ని, కుజుడు శుభాన్ని శని ఐశ్వర్యాన్ని, రాహువు బాహుబలాన్ని, కేతువు కులాధిక్యతను ఇస్తారని చెప్పబడింది కేవలం భారతదేశంలోనే కాక ఇతర దేశాలలో కూడా వివిధ పేర్లతో ఉగాదిని జరుపుకుంటారని తెలుస్తున్నది

కానీ ప్రస్తుత ప్రపంచ పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నది. ఏ రోజు ఏమి జరుగుతుందో తెలియకుండా ఉన్నది. యుగాలు గడుస్తున్నాయి సంవత్సరాలు మారుతున్నాయి. మానవ జీవితమనే కేలండరులో పేజీలు కూడా తరిగిపోతున్నాయి ఎన్ని మారినా మనిషి బుద్ధి మారకపోగా, స్వార్థం స్వప్రయోజనం పెరిగి అరిషడ్వర్గాలతో చేతులు కలుపుతున్నాడు వారి స్నేహం వలన ఆ ఆరుగురు విజృంభించి వీరవిహారం చేస్తున్నారు. మనిషి కళ్ళుండి కూడా మూసుకొని నడుస్తున్నాడు కళ్ళు తెరచి మనిషి మనీషిగా ఎదగటానికి ప్రయత్నించాలి. అప్పుడే సాటి మానవుని కష్టసుఖాలలో పాలుపంచుకోగలుగుతాడు. ఇప్పుడు మనం శుభప్రదమైన శ్రీముఖ నామ క్రొత్త సంవత్సరంలో అడుగు పెడుతున్నాము. మంచి మార్గాన నడవాలనే నిర్ణయాన్ని ఈ రోజే తీసుకుందాము నడిపించమని ఆ భగవానుని ప్రార్థించుదాం. సరిక్రొత్త ఆశలతో, ఉత్సాహంతో, ఆనందంతో ముందడుగు వేద్దాం. సుఖ సంతోషాలతో ఉందాం

"లోకాః సమస్తాః సుఖినో భవంతు" ○

మహాశివరాత్రి సందేశం

# శ్రద్ధయే శక్తి, విశ్వాసమే ఈశ్వరత్వము

-భగవాన్ సాయి దివ్య ప్రబోధ

" క్రమము తప్పక యింట
ప్రతి దినంబును భానుడు
ఉదయాస్తమయముల నొందనేల ?
గగనంబులకు కాంతి కాజేయు తారకల్
పగలు మాత్రము దాగు భంగిఏల ?
క్షణమైన విశ్రాంతి కనకతా పవనుండు
జీవకోట్లను బ్రోవ ఏవనేల ?
అనిశంబు కిలకిల ధ్వనులు నవ్వుచు నదుల్
సలిలము ప్రవహించు చందమేల ?
ప్రకృతిలో ప్రాణకోటియందు ఎందు చూచిన
ధన విభవ జాతి మత భేదంబులేల ?
ఎవని ఆజ్ఞకు బద్ధులో ఎవరు ప్రభువో
అతని ఆజ్ఞను పాలింప అరయరండు "

" ఈశానా సర్వ విద్యానాం, ఈశ్వరః సర్వభూతానాం. బ్రహ్మాధి పతిః బ్రహ్మణో పతిః అస్తు సదా శివోమ్ " ఈ సృష్టి యంతయు ఈశ్వర తాండవమే. ఇది అత్యంత అమోఘమైన నటనయే. ఇది మనోహరమైనటువంటి దృశ్యమే ఇది ఇంతే. రాత్రింపగలు, చావుపుట్టుకలు, సుఖదుఃఖములు కొనసాగిపోవుచునే ఉన్నవి ఈ జగత్తునందు. సుమతి తన పతిని బ్రతికించుకునే నిమిత్తమై సూర్యోదయమే కాకుండా చేసింది. తన పతి ప్రాణములను రక్షించుకొనే నిమిత్తమై సావిత్రి మృత్యువు రాతనే చెరిపివేసింది. ఇట్టి మహత్తరమైన శక్తి ఒక్క మానవుని యందు మాత్రమే ఉన్నది. ఈ సృష్టియందు ధర్మమూ ఉన్నది అధర్మమూ ఉన్నది కాని ఒకపరి ధర్మం పైచేయిగా ఉంటున్నది మరొకపరి అధర్మం పైచేయిగా ఉంటున్నది. భక్తిప్రపత్తులతో కూడిన మానవుడే సత్యం, శివం, సుందరంను పొందగలడు. తనయొక్క కాలము అంతము కావించుకోవలసినసమయం ఏర్పడినప్పుడు అనేక విధములయిన అపోహలకు గురి అవుతాడు మానవుడు. కంసుడు తనను అంత్యము గావించునట్టి వ్యక్తి దేవకీదేవి గర్భమున జన్మించునని విని దేవకీదేవిని చంపుటకు పూనుకున్నాడు కంసుడు. పుట్టిన ప్రతి బిడ్డను కూడనూ అందింతుననే వాగ్దానము చేసి తన సతి ప్రాణమును కాపాడుకున్నాడు వాసుదేవుడు చంపుటకు, ప్రాణములను రక్షించుకొనుటకు ఒక్క మానవుని యందు మాత్రమే ఈ శక్తి ఉన్నది ప్రతి మానవుడు కూడనూ భగవంతునియందు అంతర్భాగమై యున్నాడు తమతమ కర్తవ్యములను నిర్వర్తించుకున్నప్పుడే మానవుని యొక్క వ్యక్తిత్వము సార్థకమవుతుంది. కర్తవ్యమే మానవునకు ప్రధాననియమము. తనకు ధనమున్నది, తనకు ఐశ్వర్యమున్నది. తనకు సంపద ఉన్నది, కాని మానవుడు తన ధనమును, తన ఐశ్వర్యమును తన సంపదను తాను అనుభవించాలి. అదే అతని కర్తవ్యము. పరుల ధనమును, పరుల ఐశ్వర్యమును, పరుల సంపదను దోచుకోవడము ఇతని యొక్క విరుద్ధమైన మార్గము. ధనమనగా కేవలం భౌతిక సంబంధమైన కరెన్సీనోట్లు మాత్రమే కాదు. కేవలం ధనకనక వస్తువాహనాదులు అంటే బంగారము, వెండి మాత్రమే కాదు. నిధి అనగా తాను సంపాదించుకొన్న శక్తియే ధనము. శరీర ఆరోగ్యమూ ధనమే.

మానవుని ఆలోచనా ధనమే మానవునియొక్క భుజ బలమూ ధనమే. బుద్ధి బలమూ ధనమే కాలధనము ధనమే. కనుక తన కాలమును, తన బలమును, తన శక్తిని తాను సక్రమమైన మార్గంలో వినియోగించుకోవటమే మానవుని కర్తవ్యము కాని దురదృష్ట వశాత్తు ఈనాడు పరుల కాలమును దుర్వినియోగం చేస్తున్నాడు మానవుడు. పరుల మేధాశక్తిని కూడనూ దుర్వినియోగం చేస్తున్నాడు మానవుడు పరులయొక్క శక్తిని దోచుకుంటున్నాడు మానవుడు అదే అధర్మం అని చెప్పటానికి కారణం.

అనేక పర్యాయములు నేను పిల్లలతో కూడనూ చర్చిస్తూ ఉంటాను నాయనా! అధికంగా మాట్లాడ కూడదు అంటాను. ఎందుకనగా తాను సంపాదించుకున్న కాలము అధికంగా మాట్లాడటంచేత దుర్వినియోగం గావించుకుంటున్నాడు అంతేకాక ఎదుటి వ్యక్తితో మాట్లాడటంచేత, అధికమైన ప్రసంగములు సలపటం చేత ఎదుట వ్యక్తి కాలమునుకూడమా తాను దోచుకుంటున్నాడు ఇదికూడనూ అధర్మమే. ధర్మముఅనగా కేవలం లోకంలో వ్యక్తిత్వము యొక్క శక్తిసామర్థ్యములను సక్రమమైన మార్గంలో వినియోగించుకోవటమే. అక్రమమైన మార్గంలో ప్రవేశపెట్టటమే అధర్మము ఒక్కొక్క వ్యక్తికి ఒక్కొక్కతలఉన్నది ఒక్కొక్క తలలో ఒక్కొక్క ఆలోచన ఉంటున్నది ఒక్కొక్క ఆలోచనకు ఒక్కొక్క సంకల్పముంటున్నది. ఇవన్నీ కూడనూ తమతమ ఇచ్ఛాశక్తి చేతనే అవి అభివృద్ధి చెందుతుంటాయి. ఒకరు రాముణ్ణి యిష్ట పడతారు, మరొకరు శివుడంటే ఇష్టపడతారు మరొకరు కృష్ణా అంటే ఆనందిస్తారు మరొకరు జీసస్ అంటే ఉల్లాసపడతారు ఇంకొకరు అల్లా అంటె ఆనందిస్తారు. ఇది కేవలం తమతమ తలంపులను తమతమ తలలను పురస్కరించుకొని ప్రవేశించే భావములే కాని అన్ని మతములయందు, అన్ని దేశములయందు, అన్నిబుద్ధుల యందు ప్రధానమయిన శక్తులు రెండు ఉంటున్నాయి.

ఏ రూపాన్ని ఆరాధించవలెనన్ననూ, ఏ దైవాన్ని పూజించవలెనన్ననూ, ఏ రూపనామములు స్మరించవలె నన్ననూ శ్రద్ధ విశ్వాసమూ రెండూ ఉండాలి. శ్రద్ధ లేకుండిన ఏ చిన్న కార్యమునయినా మనం సాధించ లేము 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానం' మనయొక్క జ్ఞానం కూడనూ మనయొక్క శ్రద్ధవల్లనే లభ్యమగు తుండాలి కనుక శ్రద్ధ లేనివానికి ఏ విధమయిన తెలివితేటలుండినప్పటికినీ, మేధాశక్తి ఉండినప్పటికినీ వ్యర్థమైపోతాయి. శ్రద్ధ కలిగిన వానికి అణుమాత్రము నిప్పు అందించినప్పటికినీ దానిని శ్రద్ధచేత అనంత మయిన అగ్నిగా ప్రజ్వలింప చేసుకుంటాడు. శ్రద్ధ లేనివానికి తప్పెడు నిప్పు నిచ్చినప్పటికిని అశ్రద్ధతో దానిని ఆరగొట్టుకుంటాడు. కనుక శ్రద్ధ చేతనే మానవుడు తనయొక్క దివ్యత్వాన్ని తాను పొంద గలుగుతున్నాడు. ఆశ్రద్ధ ఎవరు? అదియే దైవశక్తి, ఆశ్రద్ధ అనగా భవాని అని దీని అర్థం అనగా దేవత, అనగా శక్తి, అనగా ప్రకృతి. ఇక విశ్వాసము అనగా ఏమిటి? ఆ విశ్వాసమే ఈశ్వరత్వము ఈ శ్రద్ధచేతనే ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి సంభవిస్తుండాలి. ఈ ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తిల ఫలముల రసమే ఈశ్వరత్వము అదియే విశ్వాసము. శ్రద్ధ విశ్వాసము లనగా పార్వతీ పరమేశ్వరులే అని అర్థము. అనగా శక్తి, ప్రకృతి, ఈ రెండింటి మూలాధారమే మానవ త్వము. ఇవి రెండూ వేరు, వేరు కాదు. నిప్పు లేకుండిన దహనశక్తే లేదు. దహనశక్తే లేకుండా అది నిప్పు కాదు. చక్కెర తీపి ఈ రెండూ అన్యోన్యా శ్రయము తీపే లేకుండిన అది చక్కెరే కాదు. చక్కెరే కాకుండినా అందు తీపిలేదు. అదేవిధముగనే శ్రద్ధ విశ్వాసము రెండూ కూడనూ అన్యోన్యాశ్రయ ములు శ్రద్ధ విశ్వాసమనునవి ప్రతి మానవునికి శివ శక్త్యాత్మక స్వరూపములని భావించాలి.

శివ, శక్తి ఇవి రెండూ వేరువేరు కాదు. కనుకనే ప్రకృతి అంతయూ కూడనూ అర్ధనారీశ్వరస్వరూపము.

అందువల్లనే దంపతులకు శ్రీమతి, శ్రీ అని ఉచ్చరిస్తూ ఉంటారు. కనుక ప్రకృతి పరమాత్మల సంబంధమే శ్రద్ధ, విశ్వాసము ఈ శ్రద్ధ విశ్వాసములు లేని మానవుడు కేవలం ఒక జీవరహితమైన దేహమనే చెప్పవచ్చును. ప్రతి మానవునియందు కూడనూ శ్రద్ధ విశ్వాసములున్నవి అయితే వాటిని విరుద్ధమైన మార్గములో ప్రవేశపెట్టి, ప్రకృతి తత్వాన్ని విశ్వసించి తమ యొక్క దివ్యత్వాన్ని విస్మరించి, తాను అనేక విధములయిన అశాంతులకు గురి అవుతున్నాడు. కనుక దైవత్వమనగా శ్రద్ధవిశ్వాసమే. ఆధ్యాత్మికమనగా కేవలం జప తప ధ్యానములు చేయటం మాత్రమేకాదు. ఆధ్యాత్మికమనగా శ్రద్ధవిశ్వాసములే శ్రద్ధ, విశ్వాసములు లేక ఏ జపము చేసినా, ఏ ధ్యానము చేసినా, ఏ భజన చేసినా ఏ దానధర్మములు చేసినా ఇవన్నీకూడనూ కేవలం వ్యర్థములే కనుక శ్రద్ధ విశ్వాసములనే శివ శక్త్యాత్మక తత్త్వమును ప్రతి మానవునియందు ఉన్న దినే విశ్వాసమును మనం అభివృద్ధిపరచుకోవాలి దీనిని ఏవిధంగా పొందాలి? సర్వకర్మ భగవత్ ప్రీత్యర్థం "మత్ కర్మకృన్మత్పరమో మద్భక్తం" ఇది భగవద్గీతలోని ప్రధానమయిన సూత్రము నీవు ఏమి చేసినా నాపరమయిన కర్మలు, నాకు సంబంధించిన భక్తిభావములు చేయమని చెప్పాడు. ఇది సగుణారాధనకు సరిఅయిన పద్ధతి. ఈ భావములు భక్తిప్రవృత్తులను అభివృద్ధి గావిస్తుంది.

భూమిని చక్కగా దున్ని దుక్కి చేసి మెత్తబరచి అన్ని రకములుగా తయారు చేసినప్పుడే ఆ భూమిలో వేసిన విత్తనములు చక్కని పంటను అందిస్తాయి. అటులనే మన హృదయమనే క్షేత్రములో దుర్బుద్ధులు, దురాలోచనలు, దుర్గుణములనే వాటిని తీసివేసి, దానిలో సద్భావములు సద్గుణములు, సదాచారములతో నింపి పరిశుద్ధ పరచినప్పుడే ప్రేమ అనే విత్తనము నాటి జ్ఞానము అనే ఫలాన్ని పొందవచ్చును దీనిని పురస్కరించుకొనియే ఆధ్యాత్మిక మార్గమందు విధ్వంసక మార్గము విధాయక మార్గము అని బోధించారు. విధ్వంసక మార్గమనగా భూమిలో విత్తులు నాటుటకు పూర్వము ఆ యొక్క భూమియందున్న ముళ్ళచెట్లను పొదలను నిరుపయోగమైన మొక్కలను తీసివేయాలి. దానినే విధ్వంసక మార్గమన్నారు. విధాయక మార్గమనగా మనకు అవసరమైన ఆనందాన్ని అందించేటటువంటి సుఖశాంతులను కలిగించే మొక్కలను అందులో నాటాలి. అదే విధముగనే ప్రతి మానవుని హృదయక్షేత్రమును కూడనూ సాగుచేయాలి ఏ విధంగా సాగుచేయాలి? శ్రద్ధ, విశ్వాసములతో సాగుచేయాలి. నేను భగవంతుని ప్రేమిస్తున్నాను అని భక్తుడు అనుకోవచ్చు. కాని ఇది సరిఅయిన భక్తి కాదు భగవంతుడు నిన్ను ప్రేమిస్తున్నాడా? లేదా? అన్న పాయింట్ మీద దృష్టిపెట్టాలి. నీవు భగవంతుని ప్రేమించవచ్చు. కాని భగవంతుడు నిన్ను ప్రేమించాలి. భగవంతుని దృష్టి నీపైన ప్రసరించాలి అప్పుడే ఆ భక్తికి తగినటువంటి అర్థము కనుక ప్రతి మానవుడు కూడనూ తాను చేయుచున్న కర్మల యందు స్వార్థము, స్వప్రయోజనము, తృప్తి నిమిత్తమై మనం పాటుపడరాదు. అంతఃకరణ శుద్ధి అదే "కాన్షస్" దాని తృప్తిని మనం పొందాలి. భగవంతుడు నిరంతరము కూడనూ సంతుష్టః ఎప్పుడు కూడనూ సంతుష్టుడై ఉంటుంటాడు. కాని ఈ కలి ప్రభావముచేత మానవునికి సంతుష్టి అనేదే లేదు. భగవత్ విషయమునందునూ సంతుష్టి లేదు. ఎప్పుడు చూచిననూ అవునో! కాదో! నిజమో! కాదో! జరుగునో! జరుగదో! ఈ సందేహాలతో ఊగిసలాడుతుంటాడు. ఇలాంటి చంచలము కలిగిన మానవునకు దైవానందము కలలో కూడనూ ప్రాప్తించదు. కనుకనే ఊగేవాడు జీవుడు, ఊగనివాడు దేవుడు అన్నారు. ఎప్పుడూ ఊగుతూనే ఉంటుంటాడు ఈ జీవుడు. కనుక ఈ చంచలత్వమనేది సాధనకు సరిఅయినదికాదు.

తదుపరి "సుహృత్" అనగా ప్రపంచములో ఉండిన వారందరికంటె పరమ మిత్రుడు భగవంతుడే.

శ్రీవాణి

తల్లిదండ్రులయినా కొంత స్వార్థము దృష్టిలో ఉంచుకొని పిల్లల్ని ప్రేమిస్తారు. అన్నదమ్ములయినా తమ స్వార్థమును దృష్టిలో ఉంచుకొనే ప్రేమిస్తారు భార్యాభర్తలయినా తమ స్వార్థమును దృష్టిలో ఉంచుకొనే ప్రేమిస్తారు కాని ఎట్టి స్వార్థమూ లేక ఎట్టి ప్రతిఫలమునూ ఆశించక, ప్రేమించేటటువంటివాడు భగవంతుడొక్కడే. ఇట్టి పవిత్రమయిన ప్రేమతత్త్వాన్ని మానవుడు అర్థం చేసుకోలేకపోతున్నాడు కాని అలాంటి మిత్రత్వమును పొందినవారే పాండవులు ద్వారకనుంచి వచ్చిన అర్జునుని చేయి పట్టుకొని కుంతి "నాయనా! కృష్ణుడు బాగున్నాడా? ఆమె మొట్టమొదట ప్రశ్నించింది అదే కృష్ణుడు బాగున్నాడా? కృష్ణుడు ఎప్పుడు వస్తాడు? కృష్ణుడు కూడా నీతో వచ్చాడా?" ఈ విధంగా ప్రశ్నిస్తూ వచ్చింది ఈ మాట వినేటప్పటికి కడుపులో పొంగిన దుఃఖము ఉట్టిపడింది. వెక్కి వెక్కి ఏడుస్తున్న అర్జునుని చూచి, ధర్మజుడు, నకుల సహదేవులు, భీముడు కూడనూ చేరాడు ఏమిటి అర్జునా? ఏమి జరిగింది?" అప్పుడు చెప్పుతున్నాడు అర్జునుడు.

" మన సారధి మన సచివుడు
మన బంధువు మన సఖుండు
మన విభవు గురువు దైవము
మనలను ఏడనాడి చనియె మధురాధిపతే "

మన విడిచి పెట్టిపోయాడు. ఎవరు? మన సారథి. మన జీవితానికే సారథి అతను. కేవలం మన రథమునకు కాదు. మన దేహమే రథము. ఈ దేహమనే రథమునందు కృష్ణుడు యింతకాలం మనకు సారథిగా ఉన్నాడు. అటువంటి మన సారథి వదలాడు. మన సచివుడు మనకు అన్ని విధముల సలహాలను అందించునది మన కాన్షస్నెస్ మనయొక్క దివ్యమైన శక్తియే మన బంధువుడు ఎవరు బంధువులు? మనవద్ద ధన కనక వస్తువాహనాదులు ఉట్టిపడుతున్నంతవరకునూ బంధువులు మన ఇంటి చుట్టూ తిరుగుతారు. చెరువులో నీరు ఉండినంతవరకునూ పెలకొద్ది కప్పలు చేరుతాయి నీరు ఎండిపోతే ఒక్క కప్పయినా అక్కడ ఉండదు వారు కాదు మన బంధువులు మనయొక్క దివ్యమయిన ఆత్మ సమీపంలో ఉండినటువంటి ఆపద్బంధువే నిజమైన బంధువు మన ధనము. మన ధనమేమిటి? మన మేధాశక్తియే మన Wealth మన దివ్యమయిన భావనే మన Wealth (సంపద) మన మిత్రుడు విభుడు, గురువు, దైవము సర్వమూతానే అలాంటివాడు ఇప్పుడిక మనకు లేడు. కనుక మిత్రత్వమనగా యిలాంటి దైవమే నిజమైన మిత్రత్వము అలాంటి మిత్రుని కంటే మరొక మిత్రుడు ఈ జగత్తునందు కానరాడు. కనుక సుహృత్ అనే తత్త్వానికి సరిఅయిన అర్థము. 'నివాసః' అయ్యా మీరెక్కడ నివసిస్తున్నారు? అని ప్రశ్నించినప్పుడు నేను ఒక హాస్టల్‌లో నివసిస్తున్నాను అని జవాబు చెప్పవచ్చు నేను హోటల్‌లో నివశిస్తున్నానని చెప్పవచ్చు, నేను ఫలానా నెంబరు యింట్లో నివసిస్తున్నానని చెప్పవచ్చు. ఇది కాదు సరి అయిన జవాబు భగవంతునియందు నివసిస్తున్నాను. అదియే నా నివాసము. అట్టి నివాసమును మనం అందుకోవాలి. 'విశ్వమే విష్ణు స్వరూపము' ఇట్టి విశ్వమునందే

## మనవి

మార్చి నెలాఖరులోపు చందాలు పంపిన వారికి, రెన్యూవల్ చేసిన వారికి మాత్రమే అమూల్యమైన శతసంచిక ప్రత్యేకసంచిక పంపబడును. చందాలు రెన్యూవల్ చేయని వారికి ప్రత్యేక సంచిక పంపబడదు. గమనించి వెంటనే చందాలు పంపి రు 15/లు వెల కలిగిన ప్రత్యేకసంచికను కేవలం రు. 4/ లకే స్వంతం చేసుకోండి. కేవలం విడిప్రతి కావల్సినవారు మాత్రం రు. 15/లు వెంటనే పంపండి!

మనం నివసిస్తున్నాము. ఈ విశ్వము, మనము వేరు కాదు. విశ్వమనే భగవంతునియందే మనం నివసిస్తున్నాము. ఇట్టి పవిత్రభావాలు మానవునియందు ఆవిర్భవించాలి. అయితే ఇట్టి భావములు రాకపోవుటకు కారణం ఏమిటి? రాగ భయ క్రోధములు ఇవి మానవుని అడ్డగిస్తున్నాయి. రాగము ఏమిటి? రాగమనగా తన కంటే వేరొకటి ఉన్నదని, తద్వారా దానిని పొందినప్పుడు సుఖశాంతులు అందుకోవచ్చని, మానవునకు శాంతి సుఖములు మనకు తెలియని ఒక శక్తిద్వారా లభ్యమగుతున్నాయని, విచారించి అట్టి తత్త్వాన్ని పొందాలని ప్రయత్నిస్తాడు. ప్రాకృతమైన పదార్థాలు కావచ్చు. అప్రాకృతమైన దివ్యశక్తులు కావచ్చు. ఏదైతేనేమి తనకంటే ఒకటి వేరుగా ఉన్నది అనే బేధభావమే రాగము. ఈ బేధభావములు ఉండకూడదు. తనకంటే భిన్నమైనది ఈ జగత్తులో మరొకటిలేదు. అందరియందూ ఉండినదే తనయందు ఉంటున్నది. ఈ దేహమునందున్న పంచభూతములే ఆ దేహమునందున్నవి. ఈ దేహమునందున్న పంచకోశములే మరొక దేహమునందున్నవి. ఈ దేహమునందున్న పంచ ప్రాణములే మరొక దేహమునందున్నవి కాబట్టి ఈ పంచకోశములందు, ఈ పంచభూతములందు, పంచ ప్రాణములయందు సమత్వమే ఉన్నదిగాని భిన్నత్వం లేదు కనుక ఇట్టి తత్త్వాన్ని చక్కగాగుర్తించి వర్తించినప్పుడే ఏకత్వమనేది మనకు ప్రాప్తిస్తుంది తన కంటే భిన్నమైనది మరొకటి ఉన్నదని భావించి దానిని పొందాలనే వాంఛయే రాగము. ఈ రాగము ఉన్నచోటనే ప్రతిబింబము అదే ద్వేషము, క్రోధము రాగమనేది రావాలి. వెంటనే భయము వచ్చి చేరిపోతుందక్కడ. ఏవిధంగా భయము? మేము దానిని పొందిన తరువాత అది మాకు లభ్యమగుతుందో! లేదో! నేను దక్కించుకోగలనో! లేదో! అనేటటువంటి సందేహమే భయము. సందేహం అనేది రావటానికి కారణం ఏమిటి? తాను ఒక బలహీనుడనని, తన కంటే బలమైన శక్తి మరొకటి ఉన్నదని విశ్వసించడమే ఈ బలహీనతకు మూలకారణం. ఈ రాగ భయములు రెండూ చేరినప్పుడే క్రోధము ప్రారంభమవుతుంది. ఈ క్రోధము మానవునికి మహాశత్రువు. కనుక రాగ భయ క్రోధములనేవి మానవునియందున్న శ్రద్ధ విశ్వాసములను పెడమార్గం పట్టిస్తుంటాయి. కనుక మొట్టమొదట ఈ రాగ భయ క్రోధములను మనం విచారించి దానిని స్వాధీనం చేసుకోవాలి ప్రతి మానవుని యందున్న శ్రద్ధ విశ్వాసములే దైవ స్వరూపాలు.

"ఈశావాస్య మిదం సర్వం" సర్వులయందునూ ఈశావాసుడే ఉంటున్నాడు ఇటువంటి ఈశ్వరత్వాన్ని పొందాలంటే ప్రత్యేకమయిన సాధనలు కాదు క్రమక్రమేణా మనం బహిర్దృష్టిని అంతం కావించుకొని అంతర్దృష్టిని అభివృద్ధిగావించుకోటానికి తగిన కృషి చేయాలి ఈ సృష్టియందు కన్పించు సర్వస్వమూ కూడనూ ఏనాటికయినా మార్పు చెందునవే. మార్పే లేకుండిన మానవునికి సంతోషమే లేదు మానవుడు కోరేదంతా మార్పునే కాని ఈ మార్పు ఎలాంటి మార్పుగా రావాలి? దివ్యమైన మార్పుగా రావాలి. లోకసంబంధమైన మార్పులు కాదు. భగవత్ సంబంధమైన మార్పులు రావాలి తన తత్త్వాన్ని తాను గుర్తించుకొన్నానన్న సత్యాన్ని తాను విశ్వసించాలి. ఒక చిన్న ఉదాహరణము. ఒక చిన్న పిట్ట ఒక కొమ్మపై వాలుతుంది. కొమ్మ అటూ ఇటూ ఊగినప్పుడు ఈ పక్షి ఏమాత్రం భయపడదు కారణం ఏమిటి? తాను కొమ్మపై ఆధారపడలేదు తన రెక్కలపైన ఆధారపడి ఉన్నది కొమ్మ ఎంత ఊగినా, తన రెక్కలు భద్రంగా ఉండినప్పుడు ఎప్పుడైనా బుర్రమని లేచిపోవచ్చు కాని ఈనాడు మానవుడు ఈ సంసారమనే వృక్షముపైన అభిమాన మమకారములనే కొమ్మలపైన, కూర్చొని అటు ఊగినా భయపడతాడు, ఇటు ఊగినా భయపడుతాడు. కారణం ఏమిటి? తనయొక్క ఆత్మ విశ్వాసం పైన తనకు విశ్వాసం లేదు. తన

( తరువాయి 37 వ పేజీలో )

# సంత్ సమర్థ రామదాసు మహోదయులు

—ఎ. ఎస్. అవధాని

అది ఒక వివాహవేదిక. పెళ్లి పందిరి శోభాయమానంగా అలంకరించబడింది. బాజా భజంత్రీలు మ్రోగుతున్నాయి వివాహం జరుగుతున్న పెళ్లి కుమారునికి, పెళ్లికూతురుకు మధ్య తెల్లని తెర అడ్డుగా ఉంది. పురోహితుడు వచ్చిన సదస్యులందరికి అక్షతలు పంచాడు. అందరు సుముహూర్తానికై వేచిఉన్నారు పెళ్లి చేయిస్తున్న బ్రహ్మ, మంగళాష్టకము బిగ్గరగా చదివి, చివరలో " సుముహూర్తా! సావధానా! " అని మూడుసార్లు అన్నాడు మూడవసారి అని, అటు చూడగానే పెళ్లిపీటమీద పెళ్లికొడుకు లేడు అదృశ్యమయినాడు ఎప్పుడు లేచి వెళ్ళాడో ఎవరు గమనించనే లేదు.

పెళ్లి పందిరి వెల, వెలబోయింది అంతవరకు ఆనందోత్సాహాలతో ఉలరారిన ఆ ప్రాంతమంతటా విషణ్ణవాతావరణం అలుముకున్నది. ఉభయ పక్షాలవారు స్తంభించిపోయారు. వచ్చిన బంధువులంతా విశ్చేష్టులయినారు భజంత్రీలు హఠాత్తుగా మేళాలాపేశారు అంతా తారుమారయింది. ఎవరికీ ఏమీ అర్థం కాలేదు. అంతవరకు ఇష్టంతోనే పెళ్లి పీటమీద కూర్చున్న ఆ 13 సం॥ల వయస్సున్న పిల్లవాడు ఎందుకు పారిపోయాడు ?

అసలీ అదృశ్యమైన పిల్లవాడెవరు ? మరెవ్వరో కాదు సమర్థ రామదాసుగా ఖ్యాతినార్జించిన మహోదయుడే ! అద్భుతమైన వైరాగ్యాన్ని ప్రదర్శించి, మరుక్షణంలో మూడు ముళ్ళు పడతాయనగా, వివాహబంధంలో పడకుండా తప్పించుకుని, భగవదన్వేషణ దిశగా పయనమై పోయిన భాగ్యజీవి. మహారాష్ట్రదేశంలో ఔరంగాబాదు జిల్లాలో, గోదావరి తీర గ్రామమైన "జాంబ" లో 1530 సం॥లో శ్రీరామనవమి పర్వదినమున పుట్టాడు. పేరు " నారాయణ " ( నరోబా ) తండ్రి సూర్యాజీపంత్, తల్లి రామాబాయ్ (సిరూబాయ్)త ఆ దంపతుల పెద్ద కుమారుడు గంగాధరపంత్ రెండవ కుమారుడు 'నరోబా'గా పిలవబడిన ' నారాయణ '

## "సమర్థుని" చిన్నతనం

నారాయణ చిన్నతనం నుండి అల్లరివాడుగా పేరు పొందాడు. తండ్రి అతని 8 వ ఏటనే మరణించాడు. తన ప్రవర్తనతో తల్లికి చాలా ఆదుర్దా కలిగించాడు నారాయణ. ఎలా బాగుపడతాడా అని ఆమెకు ఒకటే దిగులు. చుట్టుపక్కల వారన్నారు, వివాహం చేస్తే కుదురు రావచ్చని. కాని ఆ మాట అంటేనే ఎగిరిపడే వాడు నారాయణ. కారణం, యీ దిగువ సంఘటన.

ఒక రోజు, ఎవరికీ చెప్పకుండా, ఊరి పొలిమేరలో ఉన్న ఆంజనేయస్వామి ఆలయానికి వెళ్ళాడు. లోపలకు వెళ్లి ఎదురుగా ఉన్న మారుతి విగ్రహాన్ని తదేక దీక్షగా చూచాడు బుద్ధి చాతుర్యానికి, బల, శౌర్య, ధైర్య, సాహసాలకు ప్రతీకగా వెలుగొందుచున్న ఆ మూర్తి అతని హృదయాన్ని ఆకట్టుకుంది ఆజన్మ బ్రహ్మచారిగా, అకుంఠిత రామ భక్తుడుగా, విరాజిల్లిన ఆ "రామదూత" జీవిత పంథాయే తనకు అనుసరణీయమన్న నిర్ణయానికి వచ్చాడు ఆ భావం రాగానే ఆవేశం పరవళ్ళు ,తొక్కింది కళ్ళ వెంట ఆనంద భాష్పాలు జల, జల రాలాయి. నికృష్టమైన ప్రాపంచిక విషయ వాసనలలో పడనీయక, నిరంతర భగవన్నామామృత పాన చిత్తుడయ్యేటట్లు ఆశీర్వదించమని, ఆ మారుతి పవిత్ర సన్నిధానంలో, చేతులు జోడించి నమస్కరించి, హృదయపూర్వకంగా ప్రార్థించాడు. స్వామి ఆ అర్తిని గ్రహించినట్లున్నాడు. ఆశీర్వదించాడు. సమర్థ రామదాసుగా తరువాత వ్రాసిన కీర్తన

లలో ఈ సంఘటన చిత్రీకరించి, హనుమదనుగ్రహం వల్లనే తనకు రామదర్శనమయిందని వ్రాశాడు

## తీవ్ర ఆధ్యాత్మిక సాధన_జప, తపాలు

పెళ్లి పందిరి నుండి నారాయణ ఎక్కడకు వెళ్ళాడు? త్ర్యంబకం క్షేత్రానికి దగ్గరగా, నాసిక్‌కు అల్లంత దూరంలో ఉన్న గోదావరి తీరంలోని పవిత్ర 'పంచవటి' ప్రాంతానికి చేరాడు. ఆదంతా అరణ్య ప్రదేశం ఏకాంతానికి భంగం లేదు. త్రేతాయుగంలో శ్రీరామచంద్ర ప్రభువు, సీతాదేవితో ఈ ప్రాంతంలో కొన్ని సంవత్సరాలు గడిపారు. ఇక్కడ 12 సంవత్సరాలు ధ్యాన జప, తపస్సులలో నారాయణ గడిపాడు. తెల్లవారుఝామున 4 గం॥లకే లేచి గోదావరిలో స్నానం ముగించుకొని, సంధ్యావందనానంతరము, ధ్యానంలో మునిగిపోయేవాడు సూర్యోదయం కాగానే గోదావరి నదిలో దిగి, మోకాటి లోతు నీళ్ళల్లో నిలబడి మధ్యాహ్నం 12 గం॥ల వరకు, సూర్యుడు నడినెత్తికెక్కేవరకు, ఏక దీక్షగా జపం చేసేవాడు నదిలోని చేపలు, ఒక్కొక్కప్పుడు పిక్కలను కొరికి మాంసం తినేవి. లక్ష్యం చేసేవాడు కాదు. జప, ధ్యానాదులు పూర్తి కాగానే, బయటకు వచ్చి, కొన్ని ఇళ్ళకు భిక్షాటనకై వెళ్ళేవాడు భిక్షగా వచ్చిన పదార్థమంతా తానే భుజించేవాడు కాదు మూడు వంతులు చేసి, ఒక భాగం గోవులకు, మరొక భాగం చేపలకు ఇచ్చి, మూడవ వంతు మాత్రమే తాను ఉపయోగించుకొనేవాడు భోజనానంతరసమయాన్ని సద్గ్రంధ పఠన, సద్గోష్టి, సంకీర్తనలలో గడిపేవాడు. శ్రీరాముడు ఆయన ఇష్టదైవము. శ్రీరామ జయ రామ జయ జయ రామ ఆయన జప మంత్రము రాముడు నడచిన నడకే ఆయన జీవితాదర్శము. తాను 'రామదాసు' నని ప్రకటించుకున్నాడు.

## "సమర్థ రామదాసు"గా పేరెందుకు వచ్చింది ?

దేశ పర్యటనకు బయలుదేరాడు. ఈ పర్యటనలో "పైఠాన్" అన్నచోట ఒక విచిత్ర సంఘటన జరిగింది. అప్పటికే ఆయన రసభరిత సంకీర్తనా మాధుర్యం, ఆధ్యాత్మిక ప్రసంగం, ప్రబోధాల చాతుర్యం, ప్రజలలో బహుళ ప్రచారం పొందాయి ఒక రోజు 'రామదాసు' గోదావరి ఒడ్డున నడుస్తున్నాడు. శ్రీరాముని అనుసరిస్తూ చేతిలో విల్లు బాణాలు కూడ తీసుకువెళ్తున్నాడు. దారిలో కొందరు బ్రాహ్మణులు అతణ్ణి చూచారు అడిగారు.

" నీవు ఆ విల్లును ఎక్కుపెట్టి ఉపయోగించగలవా ? "

" ఆ " అన్నాడు రామదాసు "అయితే ఆకాశంలో ఎత్తుగా ఎగురుతున్న ఆ పక్షిని కొట్టు చూద్దాం" అన్నారు

రామదాసు వెంటనే విల్లును ఎక్కుపెట్టి బాణాన్ని పక్షి పైకి వదిలాడు. ఆ దెబ్బకు అది క్రింద కూలి ప్రాణాలు వదిలింది అప్పుడన్నారు బ్రాహ్మణులు —

నీవు సాధువు కదా! అమాయక పక్షిని కొట్టి చంపవచ్చా ? ఎంత పాప కార్యం చేశావు! "

" మీరే కదా నన్ను చంపమన్నారు ? " అన్నాడు అమాయకంగా.

" అంతమాత్రం మేము చేయమన్నంత మాత్రాన నీవు పాపం చేయవచ్చా ? "

" అవును ! నిజమే ! అలా చేయకూడదు "

" చేసిన ఈ పాపానికి నీవు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి లేకపోతే నీవు నరకానికి పోతావు " హెచ్చరించారు బ్రాహ్మణులు.

అందుకు ఒప్పుకుని, వారు చెప్పిన [illegible]త పంతో, ప్రాయశ్చిత్త కర్మ శ్రద్ధతో [illegible]హించాడు. తరువాత అడిగాడు -

'నేను చేసిన పాపంనుండి విముక్తుణ్ణి అయినట్లేనా?'

" ఆ ! విముక్తుడవయినావు " అన్నారు వాళ్ల

" అయితే ! మరి ! ఈ పక్షికి ప్రాణం రాలేదేం?"

" చచ్చిన పక్షి మరల ఎలా బ్రతుకుతుంది ? "

" మరి ! అది బ్రతకకపోతే, నా పాపం పోయిందన్న నమ్మకమేమిటి ? "

ప్రశ్నించాడు రామదాసు వారి సమాధానం ఏమీ లేదు? వారంతా చూస్తుండగానే, ఆ నేలవ్రాలిన పక్షిని

చేతులలోకి తీసుకుని, పూర్తివిశ్వాసంతో, హృదయ పూర్వకంగా శ్రీరాముని ప్రార్థించాడు ఆశ్చర్యం! పక్షి ప్రాణంతో కదిలింది! కొద్దిసేపటికే ఊపిరి పోసుకుని, రెక్కలు టప, టప, కొట్టుకుంటూ ఆకాశంలోకి ఎగిరిపోయింది అత్యాశ్చర్యకరమైన ఈ సంఘటనను చూచినవారంతా " జై ! జై ! రామదాస సమర్థ ! అని ఎలిగెత్తి జయ, జయధ్వనాలు చేశారు. ఆ నాటినుండే నారాయణ "సమర్థ రామదాసు" గా ప్రజలచే కొనియాడబడినాడు. అదే సార్థక నామధేయమయిపోయింది.

## పరివ్రాజకుడుగా దేశ పర్యటన

విస్తృతంగా దేశ పర్యటనకు పూనుకున్నాడు "సమర్థుడు" దేశ ప్రజలు దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించటం కళ్ళారా చూచి కన్నీళ్లు కార్చాడు మొగలు పరిపాలనలో వారి దీనస్థితిని గమనించి "వీరికి విముక్తి లేదా! ప్రభూ!" అని రాముని ప్రార్థించాడు ఈ ఆలోచనలలో మునిగి, తేలుతూ, కాశీక్షేత్రం చేరి, విశ్వనాథుని మందిరంలో ప్రవేశించాడు. ఆ క్షేత్రంలో ఉన్నప్పుడే ఒక రోజు, స్వామి దర్శనం చేసుకుని, దేవాలయం బయట, గోడకానుకుని కూర్చుని విశ్రాంతి తీసుకుంటున్నాడు సమర్థ రామదాసు అతని స్ఫురద్రూపము, దివ్య తేజస్సు, ఆ క్షేత్ర యాత్రికులను, దేవాలయానికి వచ్చిన భక్తులను, విపరీతంగా ఆకర్షించాయి. ఆయన చుట్టూ చేరి మాటలు సాగించారు. ఆ సంభాషణలో ఒక ముఖ్య విషయం ఆయన దృష్టికి వచ్చింది అది గంగాతీరంలో ఉన్న హనుమాన్ ఘాట్ విషయం గంగానదిలో స్నానం చేయడానికి ఏర్పరచిన ముఖ్య ఘాట్‌లలో అది ఒకటి పైనుండి నీటి వరకు వరుసగా మెట్లు నిర్మించారు కాని దగ్గరలో ఎక్కడా "హనుమంతుని" విగ్రహంగాని, దేవాలయం గాని లేదు. భక్తులు ప్రాధేయపడి ఆయన్ని అడిగారు. " స్వామీ! మీరే ఇక్కడ 'హనుమాన్' విగ్రహాన్ని స్థాపించి, దాని నామాన్ని సార్థకం చెయ్యాలి " — రామదాసుకు ఆశ్చర్యం వేసింది. తానెక్కడవాడు? ఈ ప్రాంతంతో సంబంధమేమిటి? ఇక్కడకు యీ హనుమన్మందిర నిర్మాణానికే భగవంతుడు తీసుకొచ్చాడా! అనుకుని, వెంటనే ప్రయత్నాలకు దిగి, జయప్రదంగా హనుమ మందిర నిర్మాణం అనతి కాలంలో పూర్తిచేసి, విగ్రహ ప్రతిష్ఠ చేశాడు

దక్షిణాన రామేశ్వరం వరకు కాలి నడకను పర్యటన సాగించాడు అక్కడ నుండి తిరుమల క్షేత్రానికి వచ్చి, శ్రీ వేంకటేశ్వరుని దర్శించి, తుంగభద్ర నదీ తీరంలోని పంపా సరోవర ప్రాంతానికి వెళ్ళాడు. విరూపాక్ష స్వామిని దర్శించాడు అప్పటికి, కొన్ని దశాబ్దాలకు పూర్వమే, ఆ ప్రాంతంలో విశేష కీర్తి, ప్రఖ్యాతుల నార్జించి, జగజ్జేయమానగా వెలుగొందిన విజయనగర మహా సామ్రాజ్యం కుప్పకూలిపోయింది ఆ సామ్రాజ్య వైభవమంతా, తన ఆధ్యాత్మిక సాధనలో భాగంగా శ్రీ విద్యారణ్యస్వామి చేసిన అనితర సాధ్య కృషియేనని తెలుసుకున్నాడు. ఆ సామ్రాజ్య స్థాపనకు ధర్మపరిరక్షణకు, శ్రీ విద్యారణ్యస్వామి సాగించిన నిరంతర కృషియొక్క ప్రాధాన్యతను గ్రహించగలిగాడు విద్యారణ్య పీఠం, శ్రీకృష్ణదేవరాయలకు, సామ్రాజ్య నిర్మాణంలో, పరిపాలనలో ఎలా మార్గదర్శకత్వం వహించి, సలహాలు అందించిందో కూడా అర్థం చేసుకున్నాడు

## పండరీపుర పుండరీకుని ఆదర్శం ...

ఆ తరువాత సమర్థ రామదాసు పండరీపురం దర్శించారు అక్కడ మరొక హృదయ స్పందన ననుభవించారు ఆ క్షేత్ర మూలకారకుడైన పుండరీకుడు సాక్షాత్తు విఠల్ భగవాన్ వచ్చి దర్శనమిచ్చినా, తన మాతా, పితరుల సేవను వదలక, అది సమాప్తి అయ్యే పర్యంతం, ఇటుక మీద వేచి ఉండమని కోరగా, పండరినాథుడు నడ్డిన చేతులు పెట్టుకుని, అప్పటినుండి ఆ ఇటుకమీదనే నిలచి ఉన్నాడన్న విషయాన్ని స్మరించి, మాతృసేవా ప్రాధాన్య మెంతటిదో తెలిపే ఆ ఉదంతం నుండి, అట్టి మాతలకన్న మిన్న అయిన

"దేశమాత" సేవ పట్ల మరింత శ్రద్ధాసక్తులు కనపరచ వలసి ఉంటుందో అర్థం చేసుకోగల్గాడు. ప్రతి వానికి జన్మించిన దేశం తల్లి. స్వధర్మం తండ్రి. వీరి సేవను విస్మరించి, తపస్సు చేయడానికి, అరణ్యాలకు, హిమపర్వతాలకు పరుగులు తీయటం ఉచితం గాదు. మాతాపితరుల సేవ తరువాతనే భగత్సేవ. ప్రతివ్యక్తి ముందు తనకు జన్మనిచ్చిన భూదేవికి తన సేవల నందిచ్చిన తరువాతనే భగవంతుని వైపుకు తిరిగి, ముక్తికై సాధనలు చెయ్యాలి. దేశ పర్యటనలో ప్రోగు చేసుకున్న యీ రీతి భావనల వలన సమర్థ రామదాసు తన భావి కర్తవ్యాన్ని స్పష్టంగా నిర్ణయించుకోగలిగాడు.

## ప్రథమ గురువు సంత్ తుకారాం

ఆదొక ప్రశాంత నిశీధ సమయం. ఆ రాత్రి సంత్ తుకారాం మహారాజ్ సంకీర్తన చెయనున్నాడు. చుట్టు ప్రక్కల గ్రామాల ప్రజలంతా ఆ గాన మాధుర్యాన్ని తనివితీర గ్రోలటానికి సమావేశమైయున్నారు. శివాజీ కూడా వారిలో నొకరు. మహాసంకీర్తన ముగిసి, మంగళం పాడగానే శివాజీ లేచి పది అడుగులు వేసి, తుకారాంజీ పాదాలకు నమస్కరించి "మీ పాండురంగ సంకీర్తనా మహిమ ముందు నా రాజ్యము, అధికారము తీసికట్టు అని గ్రహించాను. నేనీ రాజ్యాన్ని, ఖడ్గాన్ని వదలి మీ శిష్యుడనై, శేషజీవితాన్ని సంకీర్తనలో గడపాలని అభిలాషిస్తున్నాను. అనుగ్రహించండి" అని వేడుకున్నాడు. ఈ మాట సంత్ తుకారాంకు ఆనందం కలిగించలేదు. ఆశ్చర్యం కలిగించలేదు. శివాజీ 'ఖడ్గాన్ని వదలి, తంబురా పడితే, రాజ్యం ఏం కావాలి? అనే భావం మెదిలి, సాష్టాంగంగా ప్రణామం చేస్తున్న శివాజీ వీపు తట్టి శివా! లే లే. నీకు సమర్థ రామదాసు సరైన గురువు. నీవేమి చేయాలో ఆయన నిర్ణయిస్తాడు. ఆయన్ని కలుసుకో. ఆయన ఇచ్చే సలహాననుసరించి నడు. నీకు ఆయనే సరైన మార్గదర్శి గురువు కూడా" అని ప్రబోధించాడు.

మహారాష్ట్ర దేశానికి తిరిగి రాగానే, సమర్థ రామదాసు శివాజీకి కబురు పంపారు. శింగన్‌వాడిలో ఉభయులు కలిసారు. శివాజీ వచ్చి సాష్టాంగ ప్రణామం చేసి "స్వామీ! నాకు మోక్షమార్గాన్ని బోధించండి. మీరే నాకు గురువు" అన్నాడు. శివాజీని చూడగానే రామదాసుకు అమితానందం కల్గింది. ఆయన ఆశయాలను అమలు చేయగల శక్తి, సమర్థతలు, శివాజీకే గలవని గ్రహించాడు.

"శివా! నీవు రోహిడేశ్వరుని వద్ద దేశాన్ని స్వతంత్ర్యం చేస్తానని ప్రతిజ్ఞ చేసావని విన్నాను. నా దేశ పర్యటనలో, విదేశీయుల ఆక్రమణ వలన దేశ ప్రజలు పడుతున్న బాధలు తెలుసుకున్నాను. దేశం ఏ ప్రమాదాన్నెదుర్కొంటున్నదో గుర్తించాను. ప్రజలను స్వతంత్రులను చేసి వారి పారంపర్య సంస్కృతిని పునరుద్ధరించాల్సిన అవసరముంది. ఇది, భగవంతుడు, మోక్షముల గురించి ఆలోచించే అదను కాదు. నీవు చేసిన ప్రతిజ్ఞను మరువకు, ప్రజల సేవే భగవత్సేవ. నీవిందులో కృతకృత్యుడివయితే భగవదనుగ్రహం ఇతోధికంగా నీకు లభిస్తుంది" అన్నాడు. ఈ ఉపదేశాన్ని శివాజీ శ్రద్ధాభక్తులతో విన్నాడు. పాదపూజ చేశాడు. ఆశీర్వదిస్తూ, రామదాసు కొబ్బరికాయ, గుప్పెడు మట్టి రెండు ఇటుకలు బహూకరించాడు. కొబ్బరికాయ హిందూ విశ్వాసంలో మంగళకరమైనది. మట్టి మాతృభూమికి ప్రతీక. ఇటుకలు బలమైన రక్షణ దుర్గం నిర్మించమన్న ఆదేశానికి చిహ్నం. ఉభయులు దేశాన్ని స్వతంత్రం చేయటానికి తీసుకోవలసిన చర్యల గురించి చర్చించుకున్నారు.

## రామదాసు స్వగ్రామానికి తిరిగి రాక

మరి కొద్ది కాలానికి రామదాసు స్వగ్రామమైన "జాంబ" చేరాడు. తన ఇంటిముందు నిలబడి 'జై! జై! రఘువీర సమర్థ!' అని కేకలు పెట్టాడు. ఎవరో స్వాములవారు వచ్చి ఉంటారని, అన్నగారి భార్య వచ్చి తలుపు తెరిచింది. రామదాసు నవ్వుతూ 'నేను బిచ్చగాణ్ణి కాదు వదినా! మీ నారాయణను' అన్నాడు. తల ఎత్తి చూచింది. గుర్తించింది. అత్తగారికి చెప్పటానికి

(తరువాయి 33వ పేజీ)

# రామాయణ కావ్యం పుట్టుక

-కప్పల ఆంజనేయశర్మ

జన్మతః బ్రాహ్మణుడు. ఒక బోయ స్త్రీని పెళ్ళి చేసుకొన్నాడు. పెక్కుమంది సంతానాన్ని పొందాడు వేటలో అతనికి భుక్తి గడవక అరణ్యమార్గం కాసి దోపిడి ప్రారంభించాడు ఎందరి తలలో పగలగొట్టాడు. ఎన్నో హత్యలు చేశాడు దొరికినంత దోచుకొన్నాడు. దోచుకోడానికి ఏదీ దొరక్కపోతే కసితో వారిని చంపే వాడు. తాను చేస్తున్నది 'పాపం' అని ఏనాడూ తలంచలేదు. తాను చేసేది 'హత్య' అని కూడా అనుకోలేదు.

ఒకనాడు ఆ అరణ్యంగుండా సప్తఋషులు వచ్చారు. వారిని అడ్డగించి, దండం పైకెత్తాడు చంపడానికి

ఋషులు ఆశ్చర్యపోయారు. 'ఏం కావాలి నాయనా' అన్నారు.

" ధనం " - అని గర్జించాడు బోయ.

" ఆకూ, అలమూ తిని బ్రతికేవాళ్ళం మా దగ్గర ఏముంటుంది నాయనా " - అన్నారు వారు.

" అదంతా పనికిరాదు. దొంగవేషాలెయ్యక వున్న దేదో ముందిక్కడ పెట్టండి "-అని గర్జించాడు బోయ.

" నాయనా ! ఇదంతా ఎవరికోసం చేస్తున్నావ్ ?" అన్నాడు వసిష్ఠుడు.

" నాకోసం - నా భార్యకోసం - నా పిల్లలకోసం " అన్నాడు బోయ

" నాయనా ! నీవేమీ అనుకోనంటే ఒక్క మాట చెబుతాను విను. ఇలా దారులు కొట్టి, హత్యలు చేసి డబ్బు సంపాదిస్తున్నావు కదా ! దానితోపాటే 'పాపం' కూడా సంపాదిస్తున్నావు తెలుసా ! ఆ సంపాదించిన పాపం, డబ్బు కన్నా ఎన్నోరెట్లు ఎక్కువ. అయితే నీవు సంపాదించిన ధనాన్ని నీ భార్యా బిడ్డలు పంచుకు తింటున్నారు. ఆ సంగతి నీకు తెలుసు మరి నువ్వు సంపాదించిన 'పాపాన్ని' వారు పంచుకుంటారా " - అని ప్రశ్నించాడు మహర్షి.

' ఏమో నాకు తెలియదు ' అన్నాడు బోయ.

" వెళ్ళి అడిగిచూడు "

" మీరు-యిలా చెప్పి పారిపోవాలనుకుంటున్నారా? " అన్నాడు బోయ.

" లేదు నాయనా ! నీకాభయం లేదు. నువ్వు వచ్చే దాకా యిక్కడే వుంటాం. వేగంగా పోయి ఏ సంగతి తెలుసుకొని రా " - అన్నాడు మహర్షి.

ఇంటికి పరుగెత్తాడా బోయ. గుడిసె చేరుకొన్నాడు దార్లు కొట్టడం మూలంగా తనకు లభిస్తున్న 'పాపాన్ని' భార్యాబిడ్డలకు చెప్పాడు " ఈ పాపాన్ని పంచుకుంటారా ! " అని అడిగేడు

" ఆఁ - ఏమిటి ? పాపాన్ని మేమెందుకు పంచుకుంటాం? " అన్నారు వారంతా. ఆశ్చర్యపోయాడు. అతని మనస్సు చలించినట్లయింది. క్రింద నున్న భూమి కంపించినట్లనిపించింది వెనుదిరిగి పరుగెత్తుకు వచ్చి మహర్షుల పాదాలపైబడి భోరున ఏడ్చాడు. ఎంతో కుమిలిపోయాడు. ఋషులతనికి తారకమంత్రాన్ని తలక్రిందిగా ఉపదేశించారు.

జీవితంపై రోతపుట్టింది సర్వం విసర్జించాడు. అహోరాత్రులు 'మరా ! మరా !' అంటూ ఘోరమైన తపస్సు చేశాడు ఆ నిరంతర జపం "రామనామం"గా

# ప్రశ్నలు-సమాధానాలు

1 "అగ్ని" క్షిపణి ఏ తరహాకు చెందినది ?

2. కాకతీయుల మూలపురుషుడు ఎవరు ?

3. ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణము ఎంత ? భారత దేశంలో దాని విస్తీర్ణము ఎంత ?

4 పబ్లిక్ ఎకౌంట్స్ కమిటీ సభ్యుల సంఖ్య'

5. ప్రస్తుతం ఉన్న లోక్‌సభ ఎన్నవది ?

6. ఉపరాష్ట్రపతి పదవి వయస్సు ?

7. షెడ్యూల్ తెగల ప్రజలు ఎక్కువగా గల రాష్ట్రం ?

8. చుండూరు సంఘటనను విచారణ చేస్తున్న కమీషన్ ?

9. చంద్రుని చేరిన మొట్టమొదటి అంతరిక్ష నౌక?

10. భూమి ఆర్బిట్ నుండి బయటపడుటకు రాకెట్‌కు అవసరమైన వేగము ఎంత ?

11 గోబర్ గ్యాస్ ప్లాంటుల నుండి మనకు లభించు

సమాధానములు :

1. మధ్యతరహా 2. గుండయి 3. 2,769,54 చ॥ కి॥ మీ. 8. 4% 4. 15 లోక్‌సభ, 7 గురు రాజ్యసభ 5. 10 వది 6. 35 సం॥లు 7. మధ్య ప్రదేశ్ 8. జస్టిస్ ఎ గంగాధరరావు కమీషన్ 9. లూనిక్-II 10. 11 కిమీ/సెకన్ 11. మీథేన్

ధ్వనించింది అతడు కూర్చున్నచోట పెద్దపుట్టపెరిగింది నానావిధ కీటకములు ఆ పుట్టలో నివసిస్తూవచ్చాయి. కొంతకాలానికి బ్రహ్మ ప్రత్యక్షమై ఆయనను అనుగ్రహించాడు ఆయనయే వాల్మీకి.

ఒకనాడు సాయం సమయంలో సంధ్య వార్చుకోటానికై తమసానదీ తీరానికి వెళ్లాడు వాల్మీకి. సంధ్యాకాంతులు, ఆ నదీజలాలను బంగారు రంగులో తళతళ మనిపిస్తున్నాయి గూటికి చేరుకున్న పక్షులు కలకల మంటున్నాయి ఒక చెట్టుకొమ్మమీద రెండుక్రౌంచపక్షులు కూర్చొని, ఆనాటి తమ అనుభవాలను వల్లెవేస్తున్నాయి. వాల్మీకి ఆలోచిస్తూ, ఆ ప్రకృతి శోభను తిలకిస్తున్నాడు.

"రివ్వు" మని శబ్దచేస్తూ ఒక బాణం కొమ్మపైనున్న మగ క్రౌంచ పక్షిని దూసుకుపోయింది. ఆ పక్షి నేలపైపడింది దాని వియోగం భరించలేక ఆడు పక్షి ప్రాణాలను విడిచి నేలపైబడి మరణించింది. ఆ దృశ్యాన్ని చూచిన వాల్మీకి మనస్సు కరుణతో నిండిపోయింది. కిరాతునిపై కోపం వచ్చింది. అప్రయత్నంగా ఆయన నోటినుండి -

" మానిషాద ! ప్రతిష్ఠాత్వ
మగమశ్శాశ్వతీ సమాః
యత్క్రౌంచ మిథునాదేక
మవధీః కామమోహితం "

అనే శ్లోకం వెలువడింది, అదే అతని తొలి పద్యం.

భూతదయ ఉద్భవించిన ఆ కవితా ప్రవాహం అంతకంతకు విజృంభించింది. నారదమహర్షి రాక. అతని ప్రోత్సాహము మహా కావ్య సృష్టికి తోడైంది. అదే రామాయణం !

'సకల ప్రాణుల యెడల నీవు దయకలిగి ఉండడమనేది మంచిదే. కాని, నీ దయకు నీవు దాసుడవు కావడం మాత్రం మంచిదికాదు. సర్వేశ్వరునికి తప్ప మరెవ్వరికీ నీవు దాసుడవు కావద్దు. '

— శ్రీ అరవిందులు

# నారద భక్తి సూత్రాలు-31

# సోపానపాణి

'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి

**79 సూ. సర్వదా సర్వ భావేన**
**నిశ్చింతై ర్భగవానేవ భజనీయః**

సర్వ వేళల అన్ని విధాల సర్వ సమర్పణ భావంతో నిశ్చింతగా భగవంతుని భజించుము

యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మనః
సహప్రాణై శ్చ సర్వైః తమేవైకం
జానథ ఆత్మానం
అన్యావాచో విముంచథ అమృత స్యైష సేతుః

భగవంతుని దివ్య విభూతులు తెలిసి విశ్వసించిన భక్తుడు భగవన్నామ ధ్యాన స్మరణాదులు తప్పించి మరో కార్యం చేయజాలడు.

శంకరుడు ఉమాదేవితో ఇదే అంటాడు –

రామచంద్రుని స్వభావ ప్రభావాలు తెలిసినవాడు రామనామ ధ్యానం విడిచి మరొక కార్యం చేయలేడు అట్టి వాడు మనోవాక్కాయ కర్మల ద్వారా రామ వశం అయిపోతాడు. అతనికి మరో ఆలోచన అనేదే రాదు. దరిద్రునికి అందుబాటులో బంగారం మూట లభిస్తుంటే వాని దృష్టి మరో వైపు ఎలా ప్రసరింపకల్గుతుంది ?

భగవంతుడు సర్వాధారుడు, పరతత్త్వ ప్రకాశమానుడు, ఆనందమూర్తి, ప్రేమమయుడు, సౌందర్య మూర్తి, సచ్చిదానంద ప్రదాత అందుబాటులో నిలిచి చేతులు చాచి భగవంతుడు "రా ! బాబూ ! రా !" అని మాతృశ్రీ వలె పిలుస్తుంటే మధుర మందహాసం చిందిస్తూంటే కాదని మరొకచోటికి ఎక్కడికి వెళ్ళుతాడు భక్తుడు?

"నీవు చూడకపోయినా విన్నావుకదా, నమ్మి భక్తి విధిని పొందుము. భక్తుడు కావటానికి నీవేమీ కష్టపడ నవసరం లేదు విశ్వాసంతో విశ్వమయుణ్ణి వినుతించు. మనస్సులో చింతలు మానుకో. శిశువు తల్లి ఒడిలో నిశ్చింతగా ఆడుకున్నట్లు స్వామి పాదసన్నిధిలో ఉండిపో. రాముడుండు వరకు భయము లేదు మనకు – సర్వాత్మనా సారసాక్షుని స్మరించు, అంతే అంటాడు నారదుడు. గీతలో –

మన్మనా భవ మద్భక్తో
మద్యాజీ మాం నమస్కురు
మామేవైష్యతి సత్యంతే
ప్రతిజానే ప్రియోఽసిమే

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచ

ఓ అర్జునా ! నాపై మనస్సు నిలిపి, నా భక్తునివి కమ్ము నన్ను పూజించు, నమస్కరించు, విశ్వసించు. నన్ను పొందుతావు అన్ని ధర్మాలు మతాలు వ్రతాలు అభిమతాలు వదులుకో.

నన్నే శరణు వేడుకో నిన్ను సర్వ పాపాలనుండి కాపాడతాను. మోక్షం ఇస్తాను, నీవు కోరింది ప్రసాదిస్తాను అని కృష్ణ భగవానుడు చెప్పాడు.

శ్రీశుకులవారు ఇలా అన్నారు –

కామోత్కంఠత గోపికల్ - భయమున్
కంసుండు - వైరక్రియా

సామాగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ -
సంబంధువుౖలై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేము నిదె
చక్రింగంటి మైలైన ఉ
ద్దామ ధ్యాన గరిష్ఠుౖలైన

హరి జెందన్ వచ్చు ధాత్రీశ్వరా !

*     *     *

ధర్మము సత్యము కీర్తియు
నిర్మల దయ విష్ణుభక్తి నిరుపమ ఘన స
త్కర్మ మహింసావ్రతమును
నర్మిలిగలవారె పుణ్యులవనీ నాధా ! 000

# సాధకుడు - సాధన-

-శ్రీ చంద్రశేఖరానందగిరిస్వామి

" యదృచ్ఛాలాభసంతుష్టో
ద్వంద్వాతీతో విమత్సరః,
సమః సిద్ధావ సిద్ధౌచ కృత్వాపి
ననిబధ్యతే "

ప్రతి మానవుడు తన స్వధర్మమును ఆచరించియు కట్టుబడక సమస్త కర్మలను కర్మ యోగంగా మార్చి చివరికి తన కర్మ రహిత స్థితిని తెలుసుకొను మార్గమును భగవంతుడు ఈ శ్లోకమున తెలుపుచున్నాడు.

సాధకుడు ప్రారబ్ధవశాత్ ప్రాప్తమైనదానిని అల్పమైనను స్వల్పమైనను అధికమైనను భగవత్ ప్రసాదంగా స్వీకరించవలెను. దీనివలన అతని మనస్సు ప్రశాంతముగనుండును భగవాన్ రమణమహర్షిగారి జీవిత చరిత్రయందు మూడు ముఖ్య విషయములు మనకు గోచరమగును 1) ఈశ్వరేచ్ఛా పరికల్పిత భోగముల చేత తృప్తిగ నుండుట. 2) ఇతరులను యాచింపకుండుట. 3) తన మోతాను రమించుట. ఇట్టి జీవితము గడుపకున్న అసంపూర్ణమైన కోరికలచే ఎల్లప్పుడు అశాంతిని బొందును అందుకే బాబాగారు కూడా కోరికలకు కళ్లెములను వేయండని బోధించుచున్నాడు. లేకున్న కోరికలకు మానవుడు బానిస యగుచున్నాడు. ఇక ప్రారబ్ధమున్నంత కాలము ద్వంద్వములు ; సుఖదుఃఖములు, ఆకలిదప్పులు, శీతోష్ణములు, మానావమానములు, జననమరణములు, అనునవి తప్పకుండా వచ్చుచుండును. వీనియందు రాగద్వేష భావములు లేక ఈ ద్వంద్వములు ఆగమాపాయినము లని వచ్చుట పోవుట యను స్వభావముగలిగినవిగా తెలిసి అవి సంప్రాప్తమయినను తన స్వరూపమునుండి తన స్వధర్మమునుండి తన యిష్టదైవమునందలి నిష్ఠనుండి చలించక కూర్మమువలె ఓర్చుకొనును.

అతడు విమత్సరుడై యుండును. మాత్సర్యము లేనివాడై సర్వ ప్రాణులందు ద్వేషము లేనివాడై ప్రేమించును. "ఆత్మవత్ సర్వభూతాని" అన్నట్లు తనవలే సర్వ ప్రాణులను చూచుకొనును.

సమత్వమును సదా కలిగియుండును. తను చేయు కార్యములు సిద్ధించినను సిద్ధించకున్నను ఈశ్వరేచ్ఛగా భావించి తటస్థుడై యుండును. 'నిర్దోషం హి సమం బ్రహ్మ' ప్రపంచ దృష్టిచే భిన్న భిన్న రూపములుగ అగపడునదంతయు సమముగానున్న పరమాత్మకంటె అన్యము కాదనెడి స్థితిని బొందియుండును అనేకత్వమునందు ఏకత్వమును దర్శించును. ఈ లక్షణములు సాధకుడు ఎప్పుడైతే సంపాదించుకొనునో అప్పుడతడు ప్రతి కార్యమునకు తాను నిమిత్తమాత్రముగ నున్నాననెడి భావమును గుర్తించి కర్తవ్యమును ఆచరించినను కర్మచేగాని కర్మఫలముచేగాని బంధింపబడడు. నీటియందలి తామరాకువలె నుండును ఈ స్థితి మహాత్ముల యందు సహజమైయుండును. సాధకులు ప్రయత్నపూర్వకముగా ఈ స్థితిని సంపాదించవలెను. భగవంతుడు సర్వులకు సాధనయందు సహకరించునుగాక ! ***

# ఆంధ్రప్రదేశ్ అవతరణకు అవరోధాలను తొలగించిన రాజనీతి విజ్ఞుడు బూర్గుల

కంచి వాసుదేవరావు

**1953** అక్టోబరు 1వ తేదీన పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ ఫలితంగా ఆంధ్రుల చిరకాల వాంఛితమయిన ఆంధ్రరాష్ట్రం కర్నూలు రాజధానిగా అవతరించింది. కాని ఆంధ్రుల తుది ధ్యేయం హైదరాబాద్ సంస్థానం లోని తెలంగాణాగా ప్రసిద్ధమయిన తెలుగు ప్రాంతం మద్రాస్ మైసూరు రాష్ట్రాలలోని తెలుగు ప్రాంతాలతో కూడిన విశాలాంధ్ర. ఆంధ్రరాష్ట్ర అవతరణలో విశాలాంధ్ర లక్ష్యం చేరువయినా, ఆనాటి ప్రముఖ తెలంగాణా నాయకుల తీవ్ర వ్యతిరేకత కారణంగా ఆ లక్ష్య సాధనలో అవరోధాలు ఏర్పడ్డాయి. నూకల నరోత్తమరెడ్డి సంపాదకత్వంలో గోల్కొండ పత్రిక ప్రత్యేక తెలంగాణా కోసం నిర్విరామ ఉద్యమాన్ని నిర్వహించింది. స్వర్గీయ కొండా వెంకట రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి, జె. వి. నరసింగరావు వంటి ప్రముఖ తెలంగాణా నాయకులు ఆంధ్రరాష్ట్రంలో విలీనం కావడానికి ఏమాత్రమూ సుముఖంగా లేరు. అప్పుడు తొమ్మిది తెలంగాణా జిల్లాలలో ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతున్నారు. ఆ విధంగా విశాలాంధ్ర లక్ష్యసాధనకు తీవ్రమైన అవరోధం ఏర్పడిన సమయంలో ఆనాటి హైదరాబాద్ రాష్ట్ర ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు, స్వామి రామానందతీర్థుల చొరవ పట్టుదల వలన ఈ అవరోధాలు తొలగిపోయాయి. హైదరాబాద్ రాష్ట్రంలో తెలుగు కన్నడ, మహారాష్ట్ర భాషలు మాట్లాడే ప్రాంతాలు వుండేవి. ఒక విధంగా ఆనాటి హైదరాబాద్ రాష్ట్రం త్రివేణీ సంగమం. రాష్ట్ర పునర్వ్యవస్థీకరణపై ఫజల్‌అలీ కమిషన్ సిఫార్సుల కనుగుణంగా భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడి హైదరాబాద్ రాష్ట్రంలోని కన్నడ ప్రాంతాలు కర్నాటక రాష్ట్రంలోనూ, మార్వాడీ ప్రాంతాలు మహారాష్ట్రలోనూ విలీనం కాదలచినప్పుడు తెలుగు మాట్లాడే తెలంగాణా ప్రాంతం ఆంధ్రరాష్ట్రంలో విలీనం అవటం సమంజసమని బూర్గుల రామకృష్ణారావుగారు ఆనాటి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూతో వాదించి ఒప్పించగలిగారు. ఆంధ్రప్రాంతంలో విలీనం అవడం వలన తెలంగాణా ఆర్థికంగా, రాజకీయంగా సామాజికంగా అన్యాయాలకు దోపిడీలకు గురిఅవుతుందనిన తెలంగాణా నాయకుల భయాందోళనలు తొలగించడానికి ఆంధ్ర ప్రాంత తెలంగాణా నాయకుల మధ్య పెద్దమనుషుల ఒప్పందం కుదరడానికి తోడ్పడ్డారు తెలంగాణా నాయకుల విముఖత్వాన్ని తొలగించగలిగారు. తెర వెనుక వుండి ఆయన చేసిన కృషివల్లనే 1956 నవంబర్ 1వ తేదీన విశాలాంధ్ర ఆంధ్రప్రదేశ్ రూపంలో అవతరించింది. రాజకీయ నాయకుడిగా కాక రాజనీతిజ్ఞుడని నిరూపించుకున్నారు.

రామకృష్ణారావుగారు - తన రాజకీయ ప్రయోజనాల కోసం తన ముఖ్యమంత్రి పదవిని నిలబెట్టుకోవడానికి ఆంధ్రప్రదేశ్ అవతరణకు వ్యతిరేకంగా ఏమాత్రం మాట్లాడిన తెలుగువారి చిరకాల స్వప్నం నెరవేరి వుండేది కాదు. ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత తాను రాష్ట్ర రాజకీయాలకు దూరం కావలసి వస్తుందని తెలుసు ఐనా ఆంధ్రుల విస్తృత ప్రయోజనాలకోసం తన రాజకీయ ప్రయోజనాలను వదులుకున్నారు. నిజానికి ఆంధ్రప్రదేశ్ తొలి ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావుగారు ఎన్నికయి వుంటే ఆంధ్ర తెలంగాణాల మధ్య సంపూర్ణ భావ సమైక్యత ఏర్పడి వుండేదనీ, తెలంగాణా వారికి అన్యాయం జరుగుతున్నదన్న అభి

ప్రాయం నివురు కప్పిన నిప్పులా రగిలి రగిలి 1969-70 ప్రాంతంలో ప్రత్యేక తెలంగాణా రాష్ట్రోద్యమంగా భగ్గుమనేది కాదని పరిశీలకులు అభిప్రాయపడ్తున్నారు. 1956 లో నీలం సంజీవరెడ్డి ముఖ్యమంత్రిగా ఆంధ్రప్రదేశ్ తొలి మంత్రివర్గం ఏర్పడినప్పుడే తెలంగాణా ప్రజలలో అసంతృప్తి బీజాలు ఏర్పడ్డాయి. పెద్ద మనుషుల ఒప్పందంలోని ప్రధాన అంశమైన ముఖ్య మంత్రి పదవిని - తెలంగాణావారికి సంజీవరెడ్డి నిరాకరించారు. అది ఆరవవేలని అజాగళస్తనమని ఆయన ఉప ముఖ్య పదవిని తెలంగాణావారికి యివ్వడానికి నిరాకరించారు. ఆ విధంగా 1956 - 60 మధ్య నీలం సంజీవరెడ్డిగారు ఆనాటి తెలంగాణా ప్రముఖ నాయకులతో కోరి వైరం తెచ్చుకున్నారు. 1960 లో సంజీవయ్య ముఖ్యమంత్రి అయి కొండా వెంకట రంగారెడ్డిగారికి ఉప ముఖ్యమంత్రి పదవి ఇచ్చిన తర్వాత కాని వారి ఆగ్రహం చల్లారలేదు. రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రి అయి సంజీవరెడ్డిగారు ఉప ముఖ్యమంత్రి అయివుంటే తెలంగాణా ఆంధ్రప్రాంతాలలో ప్రత్యేక రాష్ట్ర ఆందోళనలు చెలరేగివుండేవి కావు. నిజం ఆలోచిస్తే ఆంధ్రప్రదేశ్ అవతరణకు తెలంగాణా పరంగా ఏర్పడిన అవరోధాలను తొలగించిన బూర్గుల వారికి ముఖ్యమంత్రి పదవి లభించివుంటే మరింత న్యాయంగా వుండేది. వయసు అర్హత అనుభవాలదృష్ట్యా కూడా ఆయన సంజీవరెడ్డిగారికన్నా ఏ విధంగా తక్కువ కారు కాని ఆనాటి ఆంధ్ర నాయకులు విశాలదృక్పథాన్ని ప్రదర్శించలేక బూర్గులవారిని అన్యాయం చేశారు ఈ అన్యాయాన్ని కొంతవరకయినా సరిదిద్దేందుకా అన్నట్లు నెహ్రూ ఆయనను ఉత్తరప్రదేశ్ గవర్నరుగా నియమించారు.

హైదరాబాద్ సంస్థానానికి బూర్గుల రామకృష్ణారావు తొలి తుది ప్రజాస్వామ్య ముఖ్యమంత్రి 1952 ఎన్నికలలో హైదరాబాద్ కాంగ్రెస్ మంత్రివర్గాన్ని ఏర్పాటు చేయగల మెజార్టీ సంపాదించింది. ఆనాడు హైదరాబాద్ రాష్ట్ర కాంగ్రెస్ నాయకులలో స్వామి రామానందతీర్థ, దిగంబరరావు బిందు కాశీనాద్ వైద్య బూర్గుల రామకృష్ణారావు వంటి అతిరథ మహారథులు వున్నారు. ముఖ్యమంత్రి పదవిని రామకృష్ణారావు దిగంబరరావు బిందులు పోటీపడగా అది రామకృష్ణారావు గారికి దక్కింది. 1952-56 సంవత్సరాలు హైదరాబాద్ చరిత్రలో సంధియుగం - భారత ప్రభుత్వ సైనిక చర్య కారణంగా 1948 సెప్టెంబర్‌లో నిజాం నిరంకుశపాలన అంతరించింది ఎల్లోడి నాయకత్వంలో బూర్గుల, దిగంబరరావు బిందువంటి కొందరు నాయకులతో తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడింది. 1948-51 మధ్య తెలంగాణాలో కమ్యూనిస్ట్ ప్రారంభించిన సాయుధ పోరాటం వలన తెలంగాణా ప్రజాజీవనం అస్తవ్యస్థమయింది. ఈ పరిస్థితులలో రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రి అయ్యారు. అప్పటికే హైదరాబాద్ సంస్థాన విచ్ఛిత్తి కనుచూపుమేరలో వుంది రాష్ట్రంలోని మూడు భాషా ప్రాంతాలు - పొరుగున వున్న ఆ భాషారాష్ట్రాలలో విలీనం చేయవలసిన బాధ్యత కూడా రామకృష్ణారావుగారిపై పడింది. ఆ బాధ్యతను ఆయన జయప్రదంగా నిర్వహించారు.

రామకృష్ణారావుగారు బహుభాషాకోవిదుడు. సంపన్న భూస్వామ్య కుటుంబానికి చెందినవారయినా సంస్కరణశీలి-అభ్యుదయ భావాలు కలవాడు. ఆయన హయాంలో అనేక ప్రగతిశీలక చట్టాలకు, పథకాలకు అంకురార్పణ జరిగింది. మూడు భాషల ప్రతినిధులు వున్న హైదరాబాద్ విధానసభలో ఎవరు ఏ భాషలో ప్రశ్నలడిగితే ఆ భాషలో సమాధానాన్ని ఇచ్చేవారు. ఆయన సాహితీప్రియుడు. అనేక ప్రాచీన గ్రంథాలు చదివారు. సాధనాసమితి మొదలైన సాహిత్య సంస్థలను ఆయన ప్రోత్సహించారు.

రామకృష్ణారావుగారు మృదుభాషి. తన రాజకీయ ప్రత్యర్థులను సైతం పరుషంగా మాట్లాడేవారుకారు. 1956 లో ముఖ్యమంత్రి అయిన తర్వాత ఆయన రాష్ట్ర రాజకీయాలకు దూరంగా వున్నారు. గవర్నర్‌గా ఆయన ఏనాడూ వివాదాలకు గురికాలేదు. ఆయన భౌతికంగా వామనుడయినా నైతికవిలువలలో త్రివిక్రముడు. వచ్చిన ప్రతి వ్యక్తిగత ఉత్తరానికి జవాబు ఇచ్చేవారు. ఆ ఉత్తరాలు స్వదస్తూరితోనే వుండేవి.

# గీత - అమృతవర్షిణి

సాయి గంగామహాదేవ్

శ్లో॥ ప్రశాంత మనసం హ్యేనం
యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంత రజసం
బ్రహ్మభూతమకల్మషమ్ ॥

— సృష్టిలోని ప్రతి ప్రాణీ "ఉత్తమమైన సుఖం కావాలి" అని కోరుకుంటాయి. కానీ ఉత్తమమైన సుఖమేదో ఈ ప్రాణులకు తెలియనందున, ఉత్త సుఖాలైన ఇంద్రియ సుఖాలనే అవి అనుభవిస్తూ చివరకు దుర్గతి చెందుచున్నవి. కానీ మానవులకు ఉత్తమ సుఖమేదో ఉత్త సుఖమేదో తెలుసుకొనే విజ్ఞానమున్నది. ఐనప్పటికినీ మానవులలో ఏ కొద్దిమందో తప్ప చాలా మంది ఈ విజ్ఞానమును సద్వినియోగపరచుకోకుండా, అజ్ఞానులై వీరు కూడా పశువులవలెనే ఉత్త సుఖాలనే ఆశ్రయిస్తూ ఆరాటపడుతున్నారు. ఐతే అసలు "సుఖ" మంటే ఏమిటి ?

"సుష్ఠుఖనత్య శుభమితి సుఖం" అనగా అశుభమును పోగొట్టునది సుఖము. ఆనందమును శోభింప జేయునది శుభము. ఇట్టి ఆనందశోభను దూరము చేయునిదే అశుభము. కావున సుఖమనగా దుఃఖమును శాశ్వతముగా దూరముచేసి, శాశ్వతానందమును నిలుపునదే సుఖము ఈ సుఖము - కోరినవారినవారినందరినీ వచ్చి చేరదు యీ ఉత్తమ సుఖము ఎవరిని వరిస్తుందో ఇచ్చట చాలా భావ గంభీరముగా భగవానుడు ప్రబోధించినాడు.

1 అకల్మషం, 2. శాంతరజసం, 3. ప్రశాంత మనసం, 4. బ్రహ్మభూతం యీ నాలుగు లక్షణాలున్న వానికే సుఖప్రాప్తి, తక్కిన వారికి దుఃఖ ప్రాప్తియే. ఐతే వాటిగురించి కొంత విచారింతుము. 1. అకల్మషము: అనగా మల, విక్షేప, ఆవరణలలో - పాపములు ప్రక్షాళనమైన స్థితి, ఇది తమోగుణ రహితావస్థ అని చెప్పవచ్చును. భావకల్మషము, వాక్ కల్మషములు, కర్మ కల్మషములు లేని స్థితి త్రికరణశుద్ధి గల అవస్థ ఇది. 2 శాంత రజసం: అనగా మల, విక్షేప, ఆవరణలలో విక్షేపము రహితమైన స్థితి ఇది ఇది రజోగుణ రహితావస్థ. 3. ప్రశాంత మనసం: అనగా మల, విక్షేప, ఆవరణలలో ఆవరణ లేని స్థితి ఇది ఇది సత్వ గుణ రహితావస్థ ఏ సుఖాపేక్షయూ లేని మోక్ష సంన్యాసస్థితి ఇది. 4. బ్రహ్మ భూతం: అనగా త్రిగుణములు రహితమై; మల, విక్షేప, ఆవరణలు అదృశ్యమై తదాకారముగా, చిదాత్మగా, బ్రహ్మముగా, అద్వితీయముగా, తాను తామగా నుండుట - అని అర్థము. ఇట్టి వానిని మాత్రమే ఉత్తమ సుఖము వరిస్తుందని భగవానుని ప్రబోధ

అనగా అంతరార్థమేమన సుఖము ప్రాకృతమైన వస్తు, విషయాదులలో లేదు అది తానే. తనను తాను బయట వెదకుట పిచ్చివాని లక్షణము. మానవుడు ఏ సుఖ, సంతోష, శాంతి, ఆనందాదులను పొందాలని సదా ప్రయత్నశీలురగుచున్నారో, ఆ సుఖ, సంతోష, శాంతి, ఆనందములు తానేనని గ్రహించాలి. కస్తూరి మృగము తన నాభియందే సువాసన ద్రవ్యమును కలిగి యుండి, ఆ ద్రవ్యము నిజముగా తానైయుండి కూడా తిరిగి ఆ సుగంధ ద్రవ్యము పొందవలెననెడి ఇచ్ఛతో అరణ్యములో పరుగెత్తుతూ వెళ్ళి మృగములకు ఆహారమైనట్లు, మానవులు తామే సుఖ స్వరూపమైయుండి కూడా భ్రాంతిచే సుఖాపేక్షులై, సుఖార్థ ప్రయత్నశీలురై ఈ జనారణ్యంలో ఈ ప్రపంచ విపినంలో తిరిగి, తిరిగీ విషయాదుల బారిపడి భ్రష్టులై జనన, మరణ చక్రంలో బంధితులు అవుతున్నారు. ఇది గ్రహించి ఆత్మయే దైవమ్, తానే సుఖమని గ్రహించి ధన్యులగుదురుగాక ! 0₀0

# గర్గ మహర్షి

-పురాణపండ 'శ్రీచిత్ర'

బ్రహ్మ మానసపుత్రులలో గర్గుడు ఒకడు. ఈతడు శివుని గురువుగా భావించి విద్య లన్నియూ సంపాదించాడు. తన్నాశ్రయించిన శిష్యకోటికి వేద శాస్త్రాలు చెప్పేవాడు. యాదవులకు, క్షత్రియులకు ఆయన కులగురువు. నందునింట పెరుగుచున్న బిడ్డకి కృష్ణుడని, రోహిణీ పుత్రునకు బలరాముడని ఈయనే నామకరణ చేశాడు. శ్రీ కృష్ణుడు పరబ్రహ్మయని గ్రహించి నందయశోదలకు వివరించి చెబుతూ "పుణ్య దంపతులారా! ఈతడు కృతయుగమున శ్వేతవర్ణుడుగా, త్రేతాయుగమున రక్తవర్ణుడుగా, ద్వాపరమున కృష్ణ వర్ణుడుగా, జన్మించినాడు. మరొక విషయం శ్రద్ధగా వినండి. 'క' కారము బ్రహ్మవాచకము 'ఋ' కారము అనంతవాచకము. 'ష' కారము శంకర వాచకము. 'ణ' కారము ధర్మవాచకము. 'అ' కారము విష్ణువాచకము. విసర్గము నారాయణార్థవాచకము. కృషి యనునది నిర్వాణవాచకము. అంతేకాదు కృషి నిశ్శ్రేష్ఠవాచకము 'ణ' కారము భక్తివాచకము 'అ' కారము ధాతృవచనము. కృషి కర్మ నిర్మూల వచనము. 'ణ' కారము దాస్యవాచకము 'అ' కారము ప్రాప్తి వచనము కృష్ణనామము సర్వశక్తి యుతమైనది. ఇక బలరాముడు అనంతుడు" అని తెలిపి ఆ అన్నదమ్ముల కార్యక్రమము ముందుగానే దివ్యదృష్టితో తెలిసికొని ఆ దంపతులకు తెలియజేశాడు గర్గమహర్షి.

ఒక శుభముహూర్తాన నామకరణ మహోత్సవం అతి వైభవంగా జరిపారు (బలరామ కృష్ణులకు). కృష్ణుని పరబ్రహ్మగా భావించి, ఏకాంత ప్రదేశము నకు తీసుకొనివెళ్ళి ప్రదక్షిణ నమస్కారములు చేసి స్తుతించాడు గర్గుడు. మరికొంతకాలానికి నందయశోదల ఆహ్వానంపై వచ్చి బలరామకృష్ణులకు ఉపనయనం చేయించి, సాందీపుని వద్దకు విద్యనభ్యసించడానికి అన్నదమ్ములను పంపి తన ఆశ్రమానికి వెళ్లిపోయాడు. కార్తవీర్యార్జునకు వైరాగ్యం జనించగా గర్గమహర్షి ఆ రాజునకు హితోపదేశం చేసి, దత్తాత్రేయుని సేవించి రాజ్యపాలన చేయమని చెప్పాడు ఆ రాజు జమదగ్నిపై యుద్ధం ప్రకటించగా గర్గుడు అడ్డుపడ్డాడు. అతని మాటలు లెక్కచేయకపోవటం వలన పరశురాముని చేతిలో కార్తవీర్యార్జునుడు హతుడయ్యాడు.

గర్గుని యాదవులు ఒక పర్యాయం పరిహసించారు. దానిని సహించలేక అతడు కాలయవనుడను వానిని పుత్రునిగా బడసి యాదవుల గర్వం అణచెదనని బిగ్గరగా పలికాడు. అందులకు వారందరూ భయపడి శరణువేడగా కృష్ణుని చేతిలో కాలయవనుడు నశించునని పలికాడు ఆ విధంగానే జరిగింది. గర్గుడు మహా ధర్మ ప్రవక్తగా ఖ్యాతిగడించాడు. ఆ మునిపేర గార్గ్యమను పేరుగల ధర్మసంహిత ఒకటి ఉంది గర్గుని చరిత్ర పరమపావనమైనది. ఆ మహర్షి నిత్య ప్రాతః స్మరణీయుడు ●

## చందాదారులకు మనవి

* తమ చందాలను కనీసం ఒక నెల ముందుగా రెన్యూవల్ చేయవలెను.
* తమ చందాను రెన్యూవల్ చేయదలచనివారు కనీసం ఒక నెల ముందుగా తెలియపరచవలెను.

# వయస్సు కాదు ముఖ్యం

-జానమద్ది హనుమచ్ఛాస్త్రి

భక్త నామదేవ్ ఒకమారు గ్రామాంతరం వెళ్తూ దారిలో ఒక కుష్ఠురోగిని చూచాడు. వాని పరిస్థితిని చూచి అతని మనస్సు కరిగింది. వాని సేవ కుపక్రమించాడు. అంతలో నామదేవుడితో బాగా పరిచయంవున్న ధనికుడు అక్కడికి వచ్చాడు. నామదేవుడు అతనిని చూచాడు కుష్ఠురోగిసేవ చేస్తున్ననామదేవ్, ధనికునికి నమస్కారంచేయలేదు ఆ శ్రీమంతునికి పట్టరానికోపం వచ్చింది. ' ఎరా, నామ్‌దేవ్, నన్ను చూచి కూడా నమస్కరించకున్నావు. నీకంటే నేను వయస్సులో పెద్ద వాణ్ణి అన్న సంగతి మరిచావా ? " అన్నాడు.

కుష్ఠురోగి సేవచేస్తున్న నామ్‌దేవ్ సమాధానమిస్తూ, అయ్యా మీ ప్రశ్నకు తర్వాత సమాధాన మిస్తాను. "దయచేసి, అదో, ఎదురుగా వున్న ఇంటికి వెళ్ళండి ఆ ఇంట్లో వున్న ఇల్లాలి వయస్సు ఎంతో తెలుసుకుని రండి". అన్నాడు.

ధనికుడు కుతూహలంతో ఆ ఇంటి వద్దకు వెళ్ళాడు. " అమ్మా ! మీ వయస్సెంత ? " అని సవినయంగా అడిగాడు.

ఆమె ముక్తసరిగా "మూడేళ్ళు" అన్నది ధనికుడు ఆశ్చర్యచకితుడయ్యాడు. " సరేనమ్మా ! మీ భర్త వయస్సెంత ? " అని ప్రశ్నించాడు.

" ఒక ఏడాది " అన్నది ఆ ఇల్లాలు.

ధనికుడు వెంటనే " అమ్మా ! మీకేమైనా మతి చెడిందా? మీ వయస్సు మూడేళ్లు అంటున్నారేమమ్మా? " అన్నాడు.

" అయ్యా ! నాకు పిచ్చిపట్టలేదు. గత మూడేళ్లుగా నేను సత్కార్యాలు చేస్తున్నాను, అంతకు ముందు ఎవరికీ, ఎటువంటి ఉపకారం చేసినదాన్ని కాదు. అందువల్ల నే నా వయసు మూడేళ్ళు నా భర్త గత సంవత్సరం నుండి పరోపకారం చేస్తున్నారు. అందువల్ల అతని వయస్సు ఏడాది. సత్కార్యాలలో గడపిన కాలమే మనిషి నిజమైన వయస్సు " అన్నదామె.

గృహిణి సమాధానం విన్న ధనికుడు సిగ్గుతో తల వంచుకున్నాడు "తల్లీ నేను అహంకారంతో మురిసి పోతున్నాను. అంతేకాదు పరమ లోభిని మీరన్నట్లు నేనింకా పుట్టనేలేదు. ఇక ముందు పరుల సేవకు పూనుకుంటాను. మీరు కళ్లు తెరిపించిన గురువు " అంటూ ఆమెకు నమస్కరించి వెళ్ళిపోయాడు ○

## విదురనీతి

పూజనీయా మహాభాగాః
పుణ్యాశ్చ గృహదీప్తయః
స్త్రియః శ్రియో గృహస్య
ఉక్తాస్తస్మాద్రక్ష్యా విశేషతః ”

స్త్రీలు పూజనీయులు, సౌభాగ్యవతులు, గృహమునకు శోభచేకూర్చువారున్ను. కనుక వారు గృహమునకు లక్ష్మిగా చెప్పబడినారు. అందువలన స్త్రీలు విశేషించి రక్షించదగినవారు.

# అహంకార మమకారము

తగిన సేవలు చేయు దాస దాసీలున్న
గుణవంతురాలగు కోడలున్న
అమిత ప్రేమగ జూచు అక్క చెల్లెండ్రున్న
తన యాజ్ఞ పాలించు తమ్ములున్న
మైత్రి నిత్యముగోరు మిత్రబృందంబున్న
తగిన అధికార యోగమున్న
విశ్వవ్యాప్తిని గాంచు కవితయున్నను
ఘన చక్రవర్తుల ధనములున్న
దైవ ప్రేమయె లేకున్న ధరణియందున
సర్వము వ్యర్థమై చనెడు వేళ
సకలశాస్త్ర పురాణ సంగ్రహ వేత్తయై
వేదాంత వేద్యుడౌ విభుధుడైన
రక్తిపసాగ రమ్యహర్మ్యంబుల
రమియించు రాజ చంద్రముడునైన
రణరంగమందు పరాభూతరిపుడౌచు
వెల్గొందు జగదేక వీరుడైన
దారిద్ర్య దేవతా దాక్షిణ్యమునకుందు
దౌర్భాగ్య విభుడగు దాసుడైన
భక్తి లేనిచో ఎందుకు పనికిరాడు
భక్తి లేనట్టి జగద్భర్తకన్న
భక్తపరుడగు దాసుడే వంద్యుడగును
ఇంతకన్నను వేఱద్ది ఎఱుకపరతు.

**దివ్యాత్మ స్వరూపులారా !**

లౌకికంగా, వైజ్ఞానికంగా మానవుడు ఈనాడెంతో ఉన్నత స్థితిని పొందాడు అమిత కీర్తిని ఆర్జించాడు సాంకేతిక విజ్ఞాన శాస్త్రములో అమిత కీర్తిని పొందాడు. కానీ నైతికంగా, ఆధ్యాత్మికంగా విమర్శలను, సంకుచితమైన భావములను అదిగమించలేకపోతున్నాడు దీనికి కారణమేమిటి ? ఎంతోకాలము నుండి మానవుని హృదయమునందు పాతుకొనిపోయిన స్వార్థమే దీనికి కారణము ఏతావాతా ఈనాటి మానవుడు స్వార్థము చేతిలో కీలుబొమ్మయై జీవిస్తున్నాడు. స్వార్థము, స్వప్రయోజనము లేక ఒక్క అడుగైనా మానవుడు ముందుకు వేయుటలేదు ఏ పదార్థము ఆశించినప్పటికిని పదార్థనిమిత్తమై పదార్థమును ఆశించటం లేదు మానవుడు. తన స్వార్థనిమిత్తమై పదార్థమును ఆశిస్తున్నాడు ఏ వ్యక్తిని ప్రేమించినప్పటికిని ఆ వ్యక్తి యొక్క నిమిత్తమై ఆ వ్యక్తిని ప్రేమించటం లేదు మానవుడు. తన స్వార్థము నిమిత్తమై వ్యక్తిని ప్రేమిస్తున్నాడు. మానవునికి ఆలోచనలుగానీ, భావములు గానీ, సంకల్పములు గానీ కేవలం స్వార్థముతో కూడి వుంటున్నాయి. ఉత్తమమైన సంకల్పములు

---

ఈనాటి మానవుడు హృదయము(HEART) ను
(Heads) పెంచుకొనేందుకు కాదు. ఈ Head (త
గడపటానికి ప్రయత్నిస్తుంది. Heart (హృదయం) ప
ఈ Heart(హృదయం) అంటే ఎడమవైపు వుండే
ప్రమాదం. Heart enlarge అయిందని Hopital
ప్రేమకు స్థానం అది విశాలం కావాలి. ఆ ప్రేమను
ఎన్ని సాధనలు జేసినా నిరుపయోగమైపోతాయి.
హృదయం కదిలిపోవాలి. హృదయ వేదనను పెంచా
సార్థకమవుతుంది.

---

# లే అనర్థాలకు మూలం

## భగవాన్ సాయి దివ్యసందేశం

మానవునిలో ఉద్భవించినప్పుడే దేశముగాని సమాజము
గానీ ఉన్నత స్థాయినందుకోగలదు.

### పరతత్త్వం

ప్రపంచములో యీనాటి మానవుడు పరతత్త్వమంటే
యేమిటో గుర్తించినటువంటివారు లేరు గుర్తించలేక
పోతిమే అనే విచారం కూడా చాలా మందికి లేదు
మాటికొక్కరో, కోటికొక్కరో యిట్టి విచారమును
నల్పుతారు. అట్టి విచారమే పరతత్త్వమునకు ప్రధాన

---

పెంచుకునేందుకు ప్రయత్నించాలిగాని తలలు
ల) అనేది కేవలం ప్రాకృతమైన జీవితాన్ని
రతత్త్వ జీవితాన్ని గడపటానికి ప్రయత్నిస్తుంది
: Physical heart కాదు. అది పెరిగితే
లో చేరుస్తారు. అదికుడివైపున ఉంటుంది. అది
పదిమందికి పంచాలి. హృదయం కరగకుండా
సాధనతో హృదయం కరిగిపోవాలి. కరిగిన
లి. పదిమందికీ పంచాలి. అప్పుడే మన జీవితం

-బాబా

---

మైన సోపానము. కడుపునిండా తిండి, కంటినిండా
నిద్ర, యింటినిండా పిల్లలు, తళతళలాడే వస్తువాహన
ములు యింతకంటే మించిన జీవిత పరమావధి మరొ
కటి లేదని భావిస్తూవుంటారు కొంతమంది. కానీ యిది
పరమాత్మలకు తగిన అర్థంకాదు. వీటివల్లనే జీవితము
మానవత్వము సార్థకముకాదు సార్థకతత్త్వాన్ని కూడా
కొంత విచారణ చేయాలి. 'ఈశావాస్య మిదం
సర్వం' ప్రపంచమంతయు కూడనూ ఈశ్వరుని
యొక్క స్వరూపమే. ఈశ్వరశక్తియే ప్రపంచ
స్వరూపములో సృష్టించబడినది. ఈ శక్తియే సమస్త
మునకు మూలకారణము కానీ యీ శక్తిని దైవశక్తిగా
విశ్వసించక కేవలం ప్రాకృతమైన శక్తిగా భావించి
వైజ్ఞానికులు దీనికి Energy అని పేరు పెడుతూవచ్చారు.
ఐతే యీ Energy అనేది గ్రీకు భాష నుండి వచ్చినది.
నిజముగా దీనియొక్క శక్తి సామర్థ్యములకు, వేదాంత
పరిభాషలో దివ్యమైన చైతన్య శక్తియని దీనికి పేరు.
ఐతే యీ శక్తిని ఎవరు కూడా నిత్య సూత్రం ప్రకారం
సృష్టించటానికి గాని నాశనం చేయటానికి గానీ వీలు
కాదు ఎవరికి అధికారం లేదు ఎవరికి యిది సాధ్యం
కాదు ఐతే ఒక శక్తినుండి మరొక శక్తి రూపాన్ని
మార్చుకోవటానికి వీలవుతుంది వర్షాకాలంలో విద్యుత్
శక్తి ఒక విధమైన కాంతి శక్తిగా రూపొందుతూ
వచ్చింది మేఘములు ఒకదానికొకటి రాసుకోవటంచేత
శబ్ద శక్తి ఏర్పడుతోంది. ఈ శబ్దశక్తితోపాటుకాంతిశక్తి
కూడా ఆవిర్భవిస్తుంది ఈశబ్దశక్తి కాంతిశక్తి రెండింటి
చేరిక చేతనే పిడుగులు అనేవి వస్తున్నాయి.
యీ విధంగా విద్యుత్ శక్తిని వివిధ మార్గములలో
వివిధ రకములుగా మార్చుకొనవచ్చునే గాని
విద్యుత్ శక్తిని నాశనం చేయటానికిగానీ లేక సృష్టించ
టానికి గాని వీలుకాదు. మానవుడు భుజించే ఆహారమును
రసమయముగామార్చి ఈ రసమే శరీరమునకు కావలసిన
శక్తి సామర్థ్యములనందిస్తోంది. ఈ ఆహారము రస
రూపములోకి మారకుండిన మానవ జీవితమే శూన్యమై
పోతుంది ఐతే ఈ రస స్వరూపంగా మారినప్పుడు దీనికి
ఆక్సిజన్ కూడా అత్యవసరము. అవే ఉచ్ఛ్వాసనిశ్వాస
ములు. దీనినే రసశక్తి అన్నారు. ఇంక సూర్య ఉష్ణము
నుండి ఒక ముడి పదార్థమును పిండి పదార్థంగా మార్చ

కొని వృక్షమును ఆ పిండి పదార్థమును తన ఆహారంగా తీసుకుంటున్నాయి ఈ విధమైన శక్తులన్నీ దివ్యశక్తులే గానీ లౌకికమైన శక్తులు కానేరవు.

ఈశక్తులనే దివ్యమైన ఆధ్యాత్మికమైన మార్గంలో ఎనిమిది శక్తులుగా వర్ణిస్తూ వచ్చింది

శబ్దబ్రహ్మమయి చరాచరమయి వాఙ్మయి
జ్యోతిర్మయి నిత్యానందమయి పరాత్పరమయి
మాయామయి శ్రీమయి

ఈ ఎనిమిది శక్తులు దివ్యమైన చైతన్యము నుండి ఆవిర్భవించినవే పీటినే మరొకపేరుతో వైజ్ఞానికులు ఉపయోగిస్తూ వచ్చారు. యంత్రశక్తి, ఉష్ణశక్తి, కాంతిశక్తి, ధ్వనిశక్తి, అయస్కాంతశక్తి, రసశక్తి, విద్యుత్‌శక్తి, అణుశక్తి. ఈ ఆధ్యాత్మిక శక్తినే వైజ్ఞానికులు యీ ఎనిమిది శక్తులుగా రూపొందింపచేసి దానికి కొత్తపేర్లు పెట్టి యిది వైజ్ఞానిక శక్తియని తమ యొక్క ప్రభావమును లోకానికి చాటుతూవచ్చారు, కానీ ఈ శక్తులు ఎక్కడ నుండి వచ్చాయి. దీనికి ఆధారమేమిటి అనే విషయాన్నిమటుకు చెప్పటంలేదు. ఉన్నదానినే వారు వినియోగిస్తున్నారు గానీ లేనిదానిని వారు సృష్టించి వినియోగించటం లేదు భూమికి ఆకర్షణ శక్తి వుంటున్నది. ఇది దీని సహజ శక్తియే కానీ పరిశోధనలు చేసి న్యూటన్ దీనిని కనిపెట్టాడు ఇక్కడ విజ్ఞానుల యొక్క అజ్ఞానం ఎంతవరకు పని చేస్తున్నదనేది మీరు గమనించాలి. ఉన్నదానిని కేవలం పరిశోధన చేసి వున్నది వున్నట్లుగా చెప్పిన వైజ్ఞానికుని పేరు ప్రపంచవ్యాప్తి అయిపోయింది కానీ వున్నవాని సంగతి మరచిపోతున్నారు. ఉన్నది అనగా belost - సత్. ఆ సత్‌ను పరిశోధన చేసి ఆ సత్ వున్నదని చెప్పినాడు కానీ వున్నది వున్నది అని చెప్పినవాని పేరు సార్థకమైనది కాని వున్నదాని వ్యాప్తి యే మాత్రం కాలేదు. అదియే దివ్యమైన శక్తి. అలాంటి శక్తియే సూర్యచంద్రాదుల యందుగానీ నక్షత్రములలో గానీ భూమియందుగానీ, ప్రతి వ్యక్తియందుగానీ సర్వత్రా వ్యాపించి వున్నది.

## సూర్యుని తేజస్సు

దీనిని పురస్కరించుకొనియే "ఈశావాస్యమిదం సర్వం" అన్నారు. ఈ సూర్యుని యొక్క ఉష్ణం హైడ్రోజన్, హీలియం కలిసి క్రమక్రమేణా ఉష్ణముగా మారుతూవచ్చింది ఈ హైడ్రోజను, హీలియం ఒక సెకనుకు ఏభైలక్షల టన్నుల వేడిని సూర్యుని నుండి వస్తున్నది నిజముగా సూర్యుడు యింత తేజస్సును వదలకుండిన జగత్తే వుండేటటు వంటిది కాదు. ఈ స్వశక్తిచేతనే వృక్షములు జీవిస్తున్నవి నదులు ప్రవహిస్తున్నాయి. వర్షము కురుస్తోంది. పంటలు పండుతున్నాయి. జీవులు ఆనందాన్ని అనుభవిస్తున్నారు. అది నిన్న నేడు కాదు కొన్నివేల మిలియనుల సంవత్సరముల నుండి జరుగుతోంది. దీనికి ఎవరు ఆధారం. దీనిని కేవలం సైంటిస్టులు Law of nature అని యువకులనందరిని పెడమార్గం పట్టిస్తున్నారు. Law of nature తోనే వారు fullstop చేస్తున్నారు గాని యీ Law ఎక్కడనుండి వచ్చింది? దీనిని యే విజ్ఞాని కూడా విచారించటంలేదు.

## పంచ గుణములు

విద్యార్థులారా! యీ Law of nature అనే స్టంటు పదమును మీరెవరు అనుసరించకూడదు అన్నింటికీ దైవము ఒకడు ఆధారముగా వున్నాడు. అతని ఆధారం లేక యేది జరగటానికి వీలు లేదు అలాంటి వాడు ఏట్టి వాంఛలు లేనివాడు. అతనినే గుణాతీతుడు అన్నారు, ఈ గుణాతీతుడనే వాడు సర్వత్రా వ్యాపించినట్లుగా అనుటలో అర్థమేమిటి? దీనికి సాక్ష్యమేమిటి? దీనికి చిన్న ఉదాహరణ. శబ్దస్పర్శరూపరసగంధములు పంచగుణములతో చేరినటువంటిది యీ ప్రకృతి. ఈ పంచగుణములతో వుండిన యీప్రకృతి యందు ఒక గుణం తగ్గిపోతుంది. శబ్దస్పర్శరూప రసములు నాలుగు మాత్రమే వుంటున్నాయి గంధములేదు జలములోపల.

మూడవ స్థానమైనది అగ్ని. అగ్నిలోపల శబ్దస్పర్శ రూపములు మూడే వుంటున్నాయి. రసగంధములు లేవు. కనుకనే అగ్ని మరింత విశాలంగా రూపొందుతూ వచ్చింది నాల్గవది గాలి ఈ గాలిలో శబ్దస్పర్శలు రెండే వుంటున్నాయి. ఇక మిగిలిన మూడూ లేవు కనుక గుణములు తగ్గేకొద్ది యీయొక్క రూపము మరింత వ్యాప్తిపొందుతున్నది కనుకనే గాలి మరింత సర్వ వ్యాపకత్వాన్ని అనుభవిస్తోంది. ఇంక శబ్దము ఆకాశము శబ్దమునకు రూపరసగంధాదులు గాని స్పర్శగానీ లేదు. కనుకనే ఆకాశము మరింత విశాలంగా రూపొందుతుంది గుణములు తగ్గేకొద్దీ రూపము విశాలమైపోతుంది. ఈ గుణములకు అతీతమైనవాడు కాబట్టి భగవంతుడు అతనికి గుణమే లేదు. అతను మరింత విశాలంగా వుంటున్నాడు. ఇట్టి విశాలతత్త్వాన్ని మనం గుర్తించ టానికి యే సైంటిస్టూ మనకక్కరలేదు అయితే గుణములలో పరమాత్మ వున్నాడు గానీ పరమాత్మలో గుణములు లేవు ఇది విద్యార్థులు చక్కగా గమనించ వలసిన విషయము గుణములో కూడా పరమాత్ముడు వున్నాడు. పరమాత్మునిలో గుణం లేదు. గుణము కల్పితం. ఈ కల్పితమనే దానికి రూప నామములు మారుతూవుంటాయి కానీ మూలాధారమైన తత్త్వం ఎప్పటికీ ఒక్కటిగానే వుంటుంది వెండి అనేక రూప నామములు ధరిస్తుంది. కానీ వీటన్నింటిని కరగిస్తే వెండి మాత్రమే మిగులుతుంది. రూప నామములు శిధిలమైపోతాయి అదే విధముగనే భగవంతునియొక్క తత్త్వము మట్టినుండి కుండ చేశారు. అయితే మట్టిలో పూర్వము కుండలు లేవు. కానీ కుండల లోపల మట్టి వున్నది అధిష్టాన తత్త్వమైన మూలాధార తత్త్వము నందు ఎట్టి రూపములు లేవు. దీని నాధారము చేసుకొనియే అన్ని రూపములు కనిపిస్తున్నాయి.

## స్వప్రకాశమైన దైవం

కనుక ప్రపంచ తత్త్వమందు మూలాధారతత్త్వము దివ్యత్వమొక్కటే ఇలాంటి పవిత్రమైన తత్త్వము ఒక రూపాన్ని ధరించవలెనంటే దీనికి కొంత పురుష ప్రయత్నం కావాలి. కానీ ఆధారం లేకుండా ఎవరు దేనిని సృష్టించుటకు వీలుకాదు. పువ్వులు, సూది, దారం వున్నాయి కానీ పుష్పమాల తానగునా ! పువ్వులున్నాయి, దారము వుంది, సూది వుంది కట్టేవాడు ఒకడు ఉండాలికదా ! కట్టేవాడు లేకపోతే యిది garlend గా తయారుకాదు. ప్రమిద, నూనె, వత్తి గలవు దీపపు వెలుగు కలుగునా? ముట్టించేవాడు ఒకడు వుండాలి కదా ! స్వర్ణము, రత్నాలు కలవు సొమ్ములు నిర్మాణమగునా ? డైమండ్సు వున్నాయి గోల్డు వుంది చేసేవాడు ఒకడు వుండాలి కదా ! అదే విధముగా భగవంతుడనేవాడు ఒకడు లేకపోతే ఈ సృష్టి ఏ రీతిగా వచ్చింది ? ఈ nature లో జడ చైతన్యములు రెండూ వుంటున్నాయి ఐతే యీ జడ చైతన్యములు రెండిం టిని కలిపి మరొక రూపాన్ని చేసేవాడు ఒకడు ఉండాలి కదా ! షాపు నుండి నీవు గుడ్డలు తెచ్చావు. అక్కడ నీకు రెడీమేడ్‌గా చిక్కవచ్చు. ఈ రెడీమేడ్ చేసినవాడు ఒకడు వుండాలికదా ! నీవు చూడకపోయినా వున్నాడు ఒకడు. అతడే భగవంతుడు. అట్టి అన్నింటికీ ఆధారభూతమైనట్టి భగవత్ తత్త్వాన్ని ఈనాడు విద్యా ర్థులు విశ్వసించటంలేదు దీనికి కారణం ఏమిటి ? దీనికి మనస్సే కారణం ఈ మనస్సు యే విధంగా అడ్డు వస్తోంది ? సూర్యుని వేడినుండి పుట్టిన మేఘములు సూర్యునే కప్పివేస్తున్నట్లు ఆత్మనుండి పుట్టిన యీ మనస్సనే మేఘము ఆత్మనే కప్పివేస్తున్నది. కనుక ఈ మనోనాశనమునకు తగిన కృషి చెయ్యాలి. మనస్సును నాశనం చేయటానికి వీలుకాదు మన మనస్సును భగవంతునిపై మరల్చినప్పుడు మనస్సు సహజంగానే అణగిపోతుంది సూర్యోదయం అయ్యేటప్పటికి చంద్రుని యొక్క వెలుతురు సహజంగానే వెనుకబడిపోతుంది. ఎప్పుడు సూర్యుడు లేకుండా పోతాడో అప్పుడు మటుకే మనకు చంద్రకాంతి ఆధారమైపోతుంది. ఈ Sun అనగా ఎవరు ? అతనే దైవతత్త్వం స్వప్రకాశమైన

దైవము. ఈ స్వప్రకాశమైన దైవమును చూడటానికి మరొకటి వేసి చూడక్కర్లేదు కనుక దివ్యత్వమైన ఆహారాన్ని మనం తీసుకున్నప్పుడు పవిత్రమైన దివ్యత్వము అందులో ప్రవేశిస్తూనే వుంటుంది. స్వస్వరూప జ్ఞానం అనేది మనకు వెతికితే కనుపించేది కాదు. వెలుగుచున్న దీపాన్ని చూడాలంటే మరొక దీపము మనకక్కరలేదు. దీపము లేనటువంటిదాన్ని చూడాలంటే దీపము కావాలి. దీపంగానే వెలుగుతున్న దానిని చూడటానికి మరొక దీపం మనకెందుకు? కనుక స్వస్వరూప జ్ఞానమనే ఆత్మ నిరంతరమూ ప్రకటిస్తూనే వుంటుంది. దీనిని చూడటానికి యింకొక జ్ఞానం మనకక్కరలేదు. దీనికి అడ్డుతగిలిన మనస్సును వేరు చేసినప్పుడే ఆ స్వస్వరూప జ్ఞానం మనకు లభ్యమవుతుంది

## ఆత్మ అనగా ?

ఆత్మ అనగా సర్వత్రా వుండిన చైతన్యమే. Conscious ( ఎరుక ) అనేది సర్వత్రా వుంటుంది. ఉపాధిని ఆధారం చేసుకొని దివ్యత్వాన్ని ప్రకటింప చేసేది. Consciousness, Conscious, Conscience యీ మూడింటి యందు జాగ్రత్త స్వప్న సుషుప్తి అని పేరు పెట్టారు. Consciousness అనేది జాగ్రత్త సర్వత్రా వుంటున్నది It is in you, above you, delow you, and around you. సర్వత్రా విండినది. దీనినే వేదము "అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్తి నారాయణస్థితః" లోపల బయట సర్వత్ర వుంటున్నది. దీనినే జాగ్రత్త అన్నారు స్వప్నస్థితి అనగా యిందులో Sences లేవు. చూచే కన్ను గానీ, వినే చెవులు గానీ, నడిచే కాళ్ళు గాని, చేసే చేతులు గానీ ఏమీ లేవక్కడ. ఒక్క మనస్సు మాత్రమే వుంటున్నది. ఈ మనస్సే అన్నింటిని పుట్టించుకొంటోంది. తనను తానే Create చేసుకుంటుంది కనుక అక్కడ చైతన్య చైతన్యశక్తి సాక్షీభూతముగా వుంటుంది. తరువాత సుషుప్తి. మంచి నిద్ర. గాఢ నిద్ర. ఈ సుషుప్తిలోకి వచ్చేటప్పటికి మనస్సు కూడా అంతర్ధానమైపోతుంది. మనస్సు ఎక్కడ లేదో అక్కడే హాయిగావుంటుంది. ఐతే తాను వున్నాడు అక్కడ తాను ఏ రూపములో వున్నాడు ? కేవలం చైతన్యస్వరూపంలో వున్నాడు. గాఢ నిద్రలో మనోబుద్ధి యింద్రియ చిత్త అహంకారములు లేకపోయినప్పటికిని జీవమున్నది కదా ! చైతన్యమున్నదికదా ! దీనికే ఉనికి అని పేరుపెట్టారు వేదాంతులు, నేను అనే అహం తత్త్వం మాత్రమే ఆ సుషుప్తిలో వుంటుంది. ఆ సుషుప్తి స్థితియందు ఎట్టి దుఃఖముగానీ, ఎట్టి బాధగానీ, ఎట్టి విచారములుగానీ లేవు కారణమేమిటి? మనస్సులేదు కనుకనే. మనస్సు లేదు కనుక అక్కడ ప్రపంచము కూడా లేదు. తిరిగి స్వప్నములోకి వచ్చేటప్పటికి మనస్సు ప్రవేశిస్తుంది. ఈ మనస్సు ప్రవేశించేటప్పటికి అన్నీ స్వప్నాలు దృశ్యాలంతా జాగ్రదవస్థలో అనుభవించిన ప్రతిబింబాలంతా అక్కడ కనిపిస్తాయి. తిరిగి మేలుకొనేటప్పటికి ప్రపంచము కనిపిస్తుంది. అన్ని సుఖదుఃఖాలు ప్రవేశిస్తాయి.

కనుక యీ ప్రపంచాన్ని చూసినప్పుడే యీ సుఖదుఃఖాలు ప్రవేశిస్తున్నాయి. కానీ ప్రపంచమే లేనప్పుడు సుఖదుఃఖములే లేవు. కనుక అన్నింటికి మూలకారణము మనస్సే. రనుక "మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అన్నారు. కనుక యీనాటి వైజ్ఞానికులందరు మూలాధారతత్త్వము ఆధారం చేసుకొని వీరు ఈ ప్రాకృతమైన శక్తిని కేవలం వారి పదములలో వినియోగిస్తున్నారు. మానవత్వమనేది ఒక దివ్యమైన శక్తి దీనినే energy అన్నారు కానీ వైజ్ఞానిక భాషలో energy అనేది తగిన పేరుకాదు. ఇంతకంటే గొప్ప పేరు ఇంగ్లీషు భాషలో చెప్పటానికి వీలుకాదు. దీనికి దివ్యశక్తి అని పేరు. దీనికే చైతన్యమని పేరు.

## HEAD - HEART

మానవ జీవితము దివ్యశక్తిని గుర్తించి, గ్రహించి స్వస్వరూపాన్ని దర్శించి ఆనందమునొందే నిమిత్తమై వచ్చినదే గానీ ఆహార నిద్రా భయమైధునాదులతో జీవితమును వ్యర్థం చేసుకొనే నిమిత్తం రాలేదు ఇది కేవలం ఉపాధి ఉండినంతవరకు ఉపాధియొక్క కర్మలు గానే వుంటున్నాయి. ఇవన్నీ ఆహారంతో ఆవిర్భవించే గుణములే కానీ ఆత్మనుండి ఆవిర్భవించే గుణములు కావు మానవ జీవితంలో తల, గుండె రెండు ప్రధానమైనవి. ఈ head నుండి జగత్తంతా పుడుతుంది కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యములు అనే అరిషడ్వర్గములంతా head నుండే వస్తున్నాయి Working, Walking, Writing అన్నీ కూడా head నుండే వస్తున్నవి ఈ సమస్త విద్యలంతా head నుండి వచ్చేటువంటివే. ఏనాటికైనా యివన్నీతిరిగి అంతర్థానమయ్యేవే. కానీ heart నుండి వచ్చేవి చాలా పవిత్రమైనవి అదే ప్రేమ, అదే సహనము అదే శాంతము అదే సత్యము. అదే అంతఃకరణయొక్క స్వభావము. కనుక యీనాటి మానవుడు హృదయాన్ని పెంచుకునేందుకు ప్రయత్నించాలి కానీ తలలు పెంచుకొనేందుకు కాదు. ఈ head అనేది కేవలం ప్రాకృతికమైన జీవితాన్ని గడపటానికి ప్రయత్నిస్తుంది. heart పరతత్త్వ జీవితాన్ని గడపటానికి ప్రయత్నిస్తుంది. ఈ heart అంటే physical heart కాదు. మానవుడు ఎప్పుడూ కూడా యేదో ఒక పని చేస్తున్నానని అహంకారమును అనుభవిస్తున్నాడు. నాది అనే మమకారము, నేను అనే అహంకారము యీ రెండే మానవుని కట్టివేస్తున్నాయి. సమస్త అనర్థములకు యీ రెండే మూలకారణం అన్నీ నేను చేస్తున్నాను, నేను చేస్తున్నాను అనుకుంటాడు.

### అంతా దైవ సంకల్పమే

నీవు నిమిత్తమాత్రుడవే గానీ నీవు చేసేది ఏమీ లేదు. భుజిస్తున్నావు. భుజించినప్పుడు యీ పని చేస్తున్నానని అనుకుంటున్నావు. కానీ జీర్ణం ఎవరు చేస్తున్నారు ? పోనీ యీ భుజించటం ఒక చేత్తో పని చేస్తున్నానని నీవు భావించవచ్చు. నీ ఉచ్ఛ్వాసనిశ్వాసములకు నీ ప్రయత్నం యేమి చేస్తున్నావు ? నీ గుండె కొట్టుకోవటానికి నీవు యే ప్రయత్నం చేస్తున్నావు ? నీ దేహంలో blood circulation కి నీవు ఏ ప్రయత్నం చేస్తున్నావు ? ఇక్కడ నీ ప్రయత్నాలేవీ పనికిరావటం లేదే. దీనిని చేసేటటువంటివారెవరు ? కనుక మానవ ప్రయత్నం ప్రయత్నం అని చెప్పి కేవలం కర్తృత్వ భోక్తృత్వాలకు గురైపోతున్నారు. అంతా దైవంయొక్క సంకల్పమే. "కదలదు నీదు సంకల్పము లేనిదే గడ్డిపోచయున్, అదియు నిదియు ననగనేల పిపీలకాది బ్రహ్మపర్యంతము నీవే, అది ఎరుంగరు మది కలంగరు ముదము చెందరు భువిని గొందరు, వివేకమున వర్తించెదరని విజ్ఞపిగెదరు కాని ఏ వేళకేది సంభవించునో ఎఱుగరు ఎవ్వరైనను ! కేవలం ఈ యొక్క అహంకారమే మానవుని అధఃపతనము చేస్తున్నది.

విద్యార్థులారా! 'విద్యాదాదతి వినయం' వినయవిధేయతలు కలిగి ఉండాలి. జీవితమంటే చాలా అర్థవంతమైనదిగా మీరు భావించాలి. ఈ అర్థవంతమైనదిఏది? తనను తాను తెలుసుకునే నిమిత్తమే తనువు నిచ్చాడు భగవంతుడు అనే సత్యాన్ని గుర్తించాలి. దేహమిచ్చినది Loadiug unloading కోసం కాదు. తన తత్త్వాన్ని శక్తిని యీ దివత్వాన్ని గుర్తించటానికని తెలుసుకోవాలి దీనికే వేదాంత పరిభాషలో వైరాగ్యమని చెబుతూ వచ్చారు. వైరాగ్యమనగా ఏమిటి ? ఆలు ౹, ఆస్తిపాస్తులను వదలి అడవులకు పోవటం కాదు.

భావమందు దుష్ట భావంబు వీడుటే
త్యాగమగును అదియె యోగమగును
ఆస్తి ఆలి వీడి అడవికేగుట కాదు.

కనుక నీ కర్తవ్యమును నీవు నిర్వర్తించు. నీ సత్య భావమును నీవు అనుసరించు. నిత్య జీవితంలో

సత్యాన్ని గుర్తించు. వేద విజ్ఞానము సత్యమునే బోధిస్తూ వచ్చింది. సత్యమనేది జ్ఞానస్వరూపం కనుక సత్య జ్ఞానములు రెండూ కూడా అమరత్వమే. ఇవి మార్పు చెందనటువంటివి కనుకనే "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ' అన్నారు. మీరు ఆధ్యాత్మికములో ఒక్కొక్క పదమునకు ఒక్కొక్క అంతరార్థము ఎన్నో విధములైన సహజ భావములతోనో కూడి వుంటాయి. ఈ నాటి వైజ్ఞానికులంతా కృత్రిమమైనవాటిని మాత్రమే ఒకదానికొకటి చేర్చి కృత్రిమమైన మూడవ దానిని సృష్టిస్తున్నారు హైడ్రోజన్, ఆక్సిజన్ చేరితే నీరు అయిందంటున్నారు ఐతే హైడ్రోజన్ ఆక్సిజన్ ఎవరు సృష్టించారు ? Law of nature వీరి జవాబు. యీ జవాబు మనకు పనికి రాదు. పంచభూతములు పరమాత్మ యొక్క అంశములే. కనుక నీవు చేసేది యేమీలేదు. ఏదో నీ పేరు ప్రతిష్టల కోసం పాటు పడుతున్నావే గానీ యీ ప్రాకృతమైన జీవితం గడిపేనిమిత్తమై యీ విజ్ఞానం నీవు వుపయోగించు కుంటున్నావేగానీ దివ్యమైన జీవితం గడపటానికి యీ ప్రాకృతమైన పంచ మహా భూతములు మనకే మాత్రం అక్కలేదు. తానే వీటి నన్నీ విధముల పోషిస్తాడు.

అడవి పక్షుల కెవ్వ డాహార మిచ్చెను ?
మృగ జాతి కెవ్వడు మేత బెట్టె ?
వనచరాదులకు భోజన మెవ్వడిప్పించె ?
చెట్ల కెవ్వడు నీళ్లు చేదిపోసె ?

దీనికి ఎవరు జవాబు చెప్పుతారు ? ఒకే జవాబు వైజ్ఞానికులది ? Law of nature. దీని వలనే యీ నాటి యువకులంతా కేవలం పెడమార్గము పడుతున్నారు, ఏ యొక్క యువకుడు యీ Law of nature అంటే యేమిటని ప్రశ్నించేవాడు లేడు. చిలుక పలుకులవలె మీరు కూడా Law of nature అంటున్నారు.

విద్యార్థులారా ! ఒక్కొక్కదానికి ఒక్కొక్క సృష్టికర్త వుంటున్నాడు. సృష్టికర్త లేకపోతే వీలేకాదు. నగలెన్నో వుండవచ్చు. చేసేవారు ఎంతమందో వుండవచ్చు. కానీ బంగారం చేసినవాడెవరు ? ఈ బంగారము మూలాధారమైనది ఈ మూలాధారమైన బంగారాన్ని తీసుకొని అనేక రకములైన ఆభరణములు చేసుకుంటున్నారు. ఈ ఆభరణములనే ప్రధానంగా చూస్తున్నాము గానీ బంగారమును చూడటం లేదు. ఈ జ్యూయల్సు అంతా నిమిత్తకారణము. ఈ జ్యూయల్సుకు అధారమైనది బంగారమే. ఉపాదాన కారణము లేకుండా నిమిత్తకారణం పుట్టుటకు వీలులేదు. భగవంతుడే ఉపాదాన కారణం నిమిత్తకారణం కూడా. కనుక భగవత్ విశ్వాసాన్ని మీరు అభివృద్ధి చేసుకోవాలి ఆ నమ్మనకమే లేని వాడు మనిషే కాడు. I am ! I am ! అంటున్నాడు ఎవడు తాను? చిన్న విషయాన్ని చక్కగా గుర్తించాలి. నీవెవరు ? మరికొన్ని నిమిషములలో my body, my muind, my బుద్ధి, my అంతఃకరణ అంటున్నాడు but who am I ? put a question ? it is my body Who are you ? it is my kerchief. Kerchief is seprate from me It is my body means I am not the body. Then who are you ? ఈ ప్రశ్న ఎవరు వేసుకోటంలేదు. ఎంతచదువులో చదువుతున్నాడు ఏమిటి ప్రయోజనము?

చదువులన్నియు చదివి చావంగ నేటికి
చావు లేని చదువు చదువవలయు

ప్రజ్ఞాన విజ్ఞాన సుజ్ఞానములే చావులేని చదువు.

విద్యార్థులారా ! లోకనిమిత్తమై మీరు జీవించటానికి లోకవిద్యలు కావాలి. కానీ అంతర్ జీవితాన్ని మీరు ఆనందముగా అనుభవించటానికి ఆధ్యాత్మిక విద్యకూడా అత్యవసరం ఈనాడు ఈ ఆధ్యాత్మిక విద్య లేకపోవటం చేత దేశం అయోమయస్థితిలో వుంటున్నది. ఎక్కడ చూసినా క్రూరమృగముల కంటే హీనమైనవారుగా వుంటున్నారు. నిజంగా చదువు లేకపోవటమా ? బుద్ధి లేకపోవటమా ? తెలివిలేకపోవటమా ? కాదు. కాదు. గుణం లేకపోవటమే దీనికి మూలకారణము. మానవతా గుణములను పెంచుకోవాలి. మానవతా గుణం లేకుండా ఎన్ని డిగ్రీలు తీసుకుని యేమి ప్రయోజనం ?

విద్యార్థులారా ! ఇంతకాలం మీరు విన్న విషయాలు, కన్న దృశ్యాలు చిత్తమునందు చేర్చుకొని జీవితమును పవిత్రమార్గంలో ప్రవేశపెట్టండి ఎట్టి పరిస్థితిలోనైనా దైవనామాన్ని మీరు వదలవద్దు. మరువవద్దు అదియే మన జీవితానికి ఆధారం. పెద్ద ట్రైన్ వుంది. చాలా వేగంగా పరుగెడుతోంది ఎన్ని లక్షలమంది జనాలు పోయి దానిని పట్టుకున్నప్పటికి అది నిలవదు కానీ యింజను రూములో ఒక చిన్న పిన్ వేస్తే చాలు అది నిలిచిపోతుంది అదే break. ఇంత చిన్న పిన్‌తో యంతో వేగంగా పోయే రైలు నిలిచిపోతుంది. అదే విధంగా యీ సమాజమనేది పెద్ద ట్రైన్. ఈ సమాజమును సరైన మార్గంలో పెట్టాలనుకున్నప్పుడు, యీ వేగాన్ని నిలపాలనుకున్నప్పుడు ఒక్క ఇంద్రియ నిగ్రహమనే "పిన్" వేస్తే చాలు. భగవన్నామమును ఉచ్చరిస్తే చాలు.

( ది. 3-6-1992 న బృందావన్‌లో భగవాన్ బాబా వారు చేసిన దివ్య ప్రసంగం నుండి)

గమనిక : ది 2-6-1992 భగవాన్ బాబావారి దివ్య ప్రసంగం తరువాత సంచికలో యివ్వబడును.

# ఆ కాం

ఏ దివ్య మూర్తిలో మాధవ రూపంబు
దర్శించి "జనయిత్రి" ధన్యమయ్యె !
ఏ దివ్య పూరుషుఁ పాదపద్మంబులు
స్పర్శించి 'జనకుండు' సంతసించె !
ఏ దివ్య రూపుని ఇలవేల్పుగా నెంచి
'తాత' కొండమరాజు ప్రీతిచెందె !
ఏ పుణ్య మూర్తిని పాపహరుండని
పాదంబు లొత్తెను పంతులయ్య !

అట్టి పుణ్యమూర్తి "పుట్టపర్తీంద్రుని"
"దర్శనంబు" మరియు "స్పర్శనంబు
తనివి దీర పొందు ధన్యమూర్తులపొందు
కోరు కొందు ముందు కూర్మిమీర !

– ఏకా రామచంద్రరావు

# సనాతన సారథి

మానవహృదయాల మాలిన్యమునుమాన్పి
"ప్రేమ"తత్త్వమ్మును పెంచునెవరు ?
అహమును మమకారమంతరింపగజేసి
"దయ"ను పెంపొందించు దాతయెవరు?
నిఖిల లోకములలో నిత్యమై వెలిగెడు
"సత్య"దీక్షను పెంచు సాధువెవరు ?
అల్లకల్లోలమై అల్లాడు జగతికి
"శాంతి"మంత్రమునేర్పు స్వామిఎవరు?

వారె ఖండఖండాల దివ్యానుభూతి
జ్ఞాన సంపద విద్వత్తు కలుగజేయు
భారతీయ సనాతన సారథియయి
జగతి లోపల జన్మించె సత్యసాయి !

– అజ్మీరు వీరభద్రయ్య

# ఉదంకుడు

_________మల్లాప్రగడ శ్రీరంగారావు

వ్యాసమహర్షికి జైమిని, పైలుడు, వైశంపాయనుడు, సుమంతుడను నలుగురు శిష్యులు ఉన్నారు. వారిలో పైలునకు ఉదంకుడనే శిష్యుడు భక్తిశ్రద్ధలతో గురుసేవ చేస్తూ గురువే దైవంగా భావిస్తున్నాడు. ఒకనాడు గురుపత్ని కోరికపై పౌష్యమహారాజు వద్దకు పోవుచుండెను. ఆ మహారాజు భార్య ధరించే కుండలాలు తెచ్చిపెట్టమని గురుభార్య ఆజ్ఞాపించగా ఉదంకుడు ఆ మహారాజు నడిగి ఆతని భార్య కుండలాలను తీసుకొని వచ్చి తన గురుపత్నికిచ్చి తన కర్తవ్యమును నెరవేర్చాలని తొందరగా వెళ్తున్నాడు. మార్గ్య మధ్యములో ఎద్దునెక్కి పోవుచున్న ఒక వ్యక్తి కనబడి గోమయాన్ని భక్షించి పోయినచో కుండలములను తీసికొని రాగలవని చెప్పగా ఆతని మాట ననుసరించి గోమయాన్ని భక్షించి పౌష్యమహారాజు వద్దకు వచ్చి మహారాణి ధరించిన కుండలాలు కావాలని, తన గురుపత్ని కోరిన విషయం చెప్పాడు తన భార్యనడిగి తీసికొనిపొమ్మని రాజుచెప్పగా అంతః పురానికి వెళ్ళిన ఆతనికామెకన్పడ లేదు. మరల రాజు వద్దకు వచ్చి మహారాణి కన్పడలేదని చెప్పెను అపుడు రాజు అపవిత్రుడలైన వారికి తన భార్య కనపడదనియు పవిత్రుడవై వెళ్లితే కన్పిస్తుందని చెప్పాడు ఉదంకుడు కాళ్లుచేతులు కడిగికొని ఆచమనం చేసి తన గురువును స్మరించుకొని అంతః పురంలోనికి పోయి ఆదేవిని దర్శించి వచ్చిన పని విన్నవించాడు ఆమె కుండలాల నిచ్చి తక్షకుడు వీటిని అపహరింప ప్రయత్నిస్తాడని జాగరూకుడవై వెళ్లమని చెప్పి, అశుచిగా ఉన్న, నేలపై పెట్టినా యీ కుండలాలు నీకు దక్కవని ఏమరుపాటు లేకుండా ప్రయాణం చేయుమని హెచ్చరించి సత్కరించి పంపివేసెను.

ఉందకుడు కుండలాలు తీసికొనివస్తూ త్రోవలో ఒక చెట్టు కొమ్మకు తగిలించి కొలనులోనికి దిగి ఆచమించి దాహము తీర్చుకొని వచ్చులోపల గాలికి చెట్టుకొమ్మ కదలి ఆ కుండలాలు నేలపై పడెను వెంటనే సర్పరాజైన తక్షకుడు వచ్చి వాటిని అపహరించి నాగలోకమునకుపోయెను. ఉదంకుడు వారి వెంట వెళ్లి నాగలోకమందలి నాగరాజులను స్తుతించాడు ఒక దివ్య పురుషుడు ప్రత్యక్షం కాగా నాగలోకం తనకు వశమగునట్టు వరము పొంది ఆనాగలోకాలను అల్లకల్లోలం చేసాడు తక్షకుడు భయపడి కుండలాలు తెచ్చి ఉదంకునికిచ్చెను. ఉదంకుడు తనకు నాగలోకమున కన్పించిన దివ్య పురుషుని వలన ఒక గుఱ్ఱమును అనుగ్రహ చిహ్నంగా గైకొని ఆ అశ్వమునెక్కి అతి వేగముగ వచ్చి గురుపత్నికి కుండలములు సమర్పించాడు.

ఉదంకుని గురుభక్తికి సంతసించి గురువైన పైల మహర్షిమార్గమధ్యంలో కన్పించినవ్యక్తి ఇంద్రుడనియు, భక్షించినగోమయము అమృతమనియు, ఎక్కివచ్చిన గుఱ్ఱమే యింద్రుని వాహనమైన ఐరావతమనియు వివరించి చెప్పి నాగలోకమందలి విశేషములను తెలియచేసేను. దైవమాగ్రహిస్తే గురువు రక్షించగలడని గురువు ఆగ్రహిస్తే దైవం కూడా రక్షించలేడని గురువును దైవం కంటే మిన్నగా భావించి సేవించిన వారికి కార్యములు సిద్ధిస్తాయని యీ భారత కథ వలన మనముతెలుసుకొని గురుభక్తిని అలవరచుకొనుటకు ప్రయత్నించి సత్ఫలములను సంపాదించుట జీవిత పరమార్థముగా భావింపవచ్చును.

# ఆత్మ దీపో భవ

-డా. రాపర్ల జనార్దనరావు

"ఆత్మదీపోభవ" అనునది ఒక మహోన్నత భావప్రేరణ వాక్యము ఒక గొప్ప ఆశీర్వచన వాక్యం అధ్యాత్మిక మార్గదర్శి. ఇంతకన్న మిన్న యైన వాక్యము కలదా అనిపించెడి ఒక మహద్వాక్యము.

" ఆత్మయే దీపముగా కలిగినవాడవు కమ్ము " అని అర్థము దీపములకన్నిటికంటే వెలుగు కల్గినది ఆత్మ దీపము. అదియే ఆత్మ జ్ఞానము. సాధకుడు తన ఆత్మను తెలిసికొనుటకే నిరంతరమైన, సుదీర్ఘమైన, సత్కార్యములను చేయును ఆత్మదర్శనము చేసుకొనిన వాడే మహాత్ముడు ఇదియో 'సోహం' భావన.

మన ఆత్మయే మనకు మిత్రుడు, గురువు, బంధువు. వీని స్నేహము, సాన్నిధ్యము సదా కలిగి ఆత్మ సంసేవనముతోడి ఆత్మానందము పొందినవాడే అత్యంత మహనీయుడు. ఆత్మ భావన, ఆత్మశక్తి విస్మరించి, పరభావనలు కల్గినచో ఆత్మయే శత్రువుగ పరిణమించును అని భగవద్గీతయందు " ఆత్మైవహ్యాత్మనో బంధు, ఆత్మైవ రిపురాత్మనః " శ్రీకృష్ణపరమాత్మ సెలవిచ్చి యున్నాడు.

" ఆత్మ దీపమును ఆశ్రయించి జీవించు అను ప్రబోధము "తత్త్వమసి" మహావాక్యమును గుర్తింప చేయును. "Thow art that" " అదియే నీవు " ఆ మహాశక్తి విశ్వశక్తి, అనంతశక్తి నీ యందే కలదు అని తెల్పు ఆత్మప్రబోధము, తొలినుండి ఆర్య జనాశ్రయము. బుద్ధుడు, శంకరాచార్యులు, మహాత్ముడు ఈ త్రోవను పయనించినవారే. న్యూమన్ కవి " Lead, kindly light ", "ప్రేమజ్యోతి ! నాకు మార్గము చూపి నడిపింపుము " అనిన వాక్యము మహాత్ముని ఎంతయో ప్రభావితము చేసినది మానవుని గమనమున మార్గము తెల్పి నడిపించెడిది, ఆత్మభావన.

మానవుడు ఒక పరిపూర్ణము నుండి జననము పొందినవాడు తాను కూడా ఆత్మ దీపము చూపిన పథమున పయనించినచో పరిపూర్ణుడగును "పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే పూర్ణస్య పూర్ణమాదాయ, పూర్ణమేవావశిష్యతే ! " " అచట నున్నది పూర్ణస్వరూపము. ఇచట నున్నదియు పూర్ణ స్వరూపమే ఒక పూర్ణము నుండి వేరొక పూర్ణము తీసినను, (రెండును) పూర్ణములుగనే ఉండిపోయినవి." అను వేద వాక్యము ఎంతటి విజ్ఞాన కుశలము, అమృత పూర్ణము, ఆత్మభావనా ప్రదీప్తికము !

అనంతమగు విశ్వశక్తితో ఆత్మానుసంధానము పొందుటయే ఆధ్యాత్మిక భావనకు తురీయస్థితి. నిగూఢ మగు ఆత్మ దీపమును వెలిగించి, వెలుగు బాటను పయనించుటయే సాధకుని మహదాశయము.

భక్త కబీర్ 'తేరే మన్ మే రాం, తేరే తన్ మే రాం, రోమ రోమ మే రాం, బోలో రాం బోలో రాం' అని ప్రబోధిస్తాడు. " నీ మనస్సులో ఉన్నాడు రాముడు. నీ తనువులో వున్నాడు రాముడు. రోమ రోమంలో ఉన్నాడు. రామా ! రామా ! అని స్మరించు" అంటాడు

' ధనము నీకు ఆహారాన్ని యిస్తుందిగాని ఆకలి నివ్వదు; మందుల నిస్తుందిగాని ఆరోగ్యాన్ని ఇవ్వదు; పరిచయాల నిస్తుందిగాని స్నేహితుల నివ్వదు; సేవకుల నిస్తుందిగాని విశ్వాసాన్ని వ్వదు : సంతోషపు దినాలనిస్తుందిగాని శాంతి నివ్వదు. '

- శ్రీ హెన్రిక్ ఇబ్సన్

# వైశ్వానరాత్మ

పునర్వసు

" అహం వైశ్వానరో భూత్వా
ప్రాణినా దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః
పచామ్యన్నమ్ చతుర్విధమ్ "

సర్వ ప్రాణికోటికి అతి సహజమైన జఠరాగ్ని (ఆకలిదప్పులు) విశ్వమంతా వ్యాపించియున్న ఆత్మ శక్తికి అవిచ్ఛిన్న స్వరూపం. జఠరాగ్నిని తృప్తి పరచటం ద్వారా జీవన కార్యక్రమమంతా నిరంతరాయంగా సాగుతూంది.

ఒకప్పుడు ప్రాచీనరుడు, సత్యజుడు, జనుడు, బుడిలుడు అనే నలుగురు సదాచార సంపన్న గృహస్థులు కలరు. ఒకరోజు వారికి ఆత్మ ఎవరు? బ్రహ్మతత్త్వం అంటే ఏమిటి? అనే సందేహం కలిగి ఉద్దాలకుని దగ్గరకి వెళ్ళగా ఆయన "వైశ్వాన విద్య గురించి చెప్పే సామర్థ్యం కేకయిరాజు అయిన అశ్వపతికే ఉన్నది" అని వారితో కలిసి అశ్వపతిని చేరి సందేహ నివృత్తికై ప్రార్థించగా మొదటి గృహస్థుని పిలచి "నీవు ఆత్మను ఏ రూపంలో భావిస్తున్నావు?" అని ప్రశ్నించెను

"నేను ఆకాశతత్త్వంలో ఆత్మోపాసన చేస్తున్నాను" అనెను. నీవు ఉపాసించేది "సుతేజ" అనే పేరుగల వైశ్వానరాత్మ రూపం ఈ భావన వల్లనే వంశంలోని వారంతా కర్మ నిష్ఠా పరతంత్రులవుతారు. ఈ సుతేజం పరిపూర్ణ వైశ్వానర తత్త్వంలో ఒక భాగమే. గాని దీనినే సమగ్రంగా భావించి ఉపాసించిన తల తెగి పడుతుంది.

రెండవ గృహస్థు ఆత్మను ఆదిత్య రూపంలో భావన చేస్తున్నానని చెప్పెను

ఈ " విశ్వరూప అనే ఆత్మ వైశ్వానరాత్మకు నేత్రం వంటిది. ఇదీ సమగ్రం గాదు. నీవీనాడు వచ్చి విషయం గ్రహించక అదే పూర్ణం అనుకొంటే అంధుడవయ్యేవాడవు.

ఇట్లే, మూడు, నాల్గు గృహస్థులు కూడా అసమగ్రమైన వైశ్వానరాత్మ భావనలో ఉన్నారని తెల్పుకున్నవాడై " ఓ జిజ్ఞాసువులారా! మీరంతా వైశ్వానరాత్మలోని అంశలను మాత్రమే ఆరాధిస్తున్నారు. వైశ్వానరాత్మకు శిరస్సు, తేజాత్మ, విశ్వరూపాత్మ, నేత్రములు, వాయువు ప్రాణం, ఆకాశము శరీరం, వృద్ధి విచారణయుగళం, అందుచేతనే అన్నం తినేముందు దానికి అగ్నిహోత్ర సిద్ధి కలగాలి. అందుకోసమే ప్రాణాహుతులుగా -

" ఓం భూర్భువస్స్వః తత్స వితుర్వరేణ్యం, భర్గో దేవస్య ధీమహి । ధియోయోనః ప్రచోదయాత్ ।
సత్యం త్వర్తేన పరిషించామి (పగలు) (ఋతింత్వా సత్యేన (రాత్రి) అమృతమస్తు । స్వాహా ! అమృతోపస్తరణమసి "

ఓం ప్రాణాయస్వాహా । ఓం అపానాయస్వాహా ।
ఓం వ్యానయస్వాహా । ఓం ఉదానాయస్వాహా !
ఓం సమానాయస్వాహా। (ఓం సచేతనఆత్మానేస్వాహా।
బ్రహ్మణ్యేస్వాహా । దైవ సంబంధము)

పంచభూతాత్మిక రూపిణీ అయిన గాయత్రీని స్మరించి ప్రాణాహుతులతో చిటికెడు మెతుకులు నోట్లో వేసుకొని అగ్నిహోత్ర సిద్ధి సాధించి ఆహారాన్ని భుజించాలి. కాని

నేడు బ్రహ్మోపదేశార్హత కల్గినవారు కూడా దానిని విస్మరించడం చేత, పార్వతీ పరమేశ్వరులే భగవాన్ శ్రీ సత్యసాయి రూపంలో అవతరించి అటు గీతా పఠన ఫలితాన్ని, ఇటు ఆహార శుద్ధిన్ని అయేటట్లు, సుమారు అంతే అర్థాన్నిచ్చే -

శ్లో॥ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః
బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం
బ్రహ్మైవ తేన గంతవ్యం
బ్రహ్మకర్మ సమాధినా

శ్లో॥ అహం వైశ్వానరోభూత్వా
ప్రాణినాం దేహమాశ్రితః
ప్రాణాపాన సమాయుక్తః
పచామ్యన్నం చతుర్విధమ్ ॥

అనే గీతా శ్లోకాలతో ఆహారశుద్ధి చేసుకుని భుజించవల్సిందిగా బోధించి ఆచరింపచేస్తున్నారు.

ఇందలి పరమార్థములు గ్రహించి ఆచరింతురుగాక! మనం తీసుకొనే ఆహారంలో ఏ అణుమాత్రము మనం సృష్టించలేము. కనుక భగవంతునికి సదా కృతజ్ఞులం.

( 12 వ పేజీ తరువాయి )

ఇంట్లోకి పరిగెత్తింది. పెళ్ళిపీటల మీద నుండి పారి పోయిన తనయుడు వచ్చాడన్న వార్త విని ఒళ్ళే మరచిపోయి, మహదానందంతో ఉబ్బితబ్బిబ్బైంది తల్లి రామాబాయ్. సమర్థుడు ఇంట్లోకి వెళ్ళి తల్లి పాదాలపై ప్రణమిల్లాడు కాషాయరంగు వస్త్రంతో, పెరిగిన జుట్టు, గడ్డంతో ఉన్న కుమారుని చూచి భ్రాంత పోయింది. కొంతసేపటికి తేరుకుని " నారాయణ " " నారాయణ " అని పిలిచింది.

" అవునమ్మా ! నేను నారాయణనే "

" మరి! ఇట్లా తయారయినావేమిటి ? విన్నేదయినా భూతం ఆవహించిందా ? " అన్నది.

" అవును ! శ్రీమహావిష్ణువవతారము, కౌసల్యాదేవి పుత్ర రత్నము, తాటక సంహారి, అయిన శ్రీరామ చంద్రుడు నన్నావహించాడు, అనే భావం వచ్చే కీర్తన సుమధురంగా గానం చేసాడు. ఆమెకు కళ్ళవెంట ఆనందాశ్రువులు జల, జల రాలాయి.

## శివాజీ రాజ్యదానం_సమర్థుని ఔదార్యం

1674 సం॥లో రాజగఢ్ వద్ద శివాజీ పట్టాభిషేకం అత్యంత వైభవంగా జరిగింది హిందూ సామ్రాజ్యానికి చక్రవర్తిగా ఆయన సింహాసనాధీనుడైనాడు. ఆ మహోత్సవంలో సమర్థ రామదాసు పాల్గొన్నాడు. తన కలలు ఆ విధంగా రూపుదిద్దుకున్నందుకు మహదానంద భరితుడైనాడు. రాజగఢ్‌లోనే గురువుగారి బసకు శివాజీ ఒక ప్రత్యేక భవనం నిర్మించాడు

ఒక పర్యాయం సమర్థ రామదాసు, పదిమంది శిష్యులు వెంటరాగా శివాజీ వద్దకు ప్రయాణమైనారు. కలినడకనే వెళ్తున్నారు. ప్రయాణం దూరభారం. పొద్దు నడినెత్తికెక్కింది శిష్యులంతా ఆకలితో అలమటించిపోతున్నారు. బడలిక తీర్చుకునేందుకు మార్గ మధ్యలో "సమర్థుడు" శిష్యులతో ఒక చెట్టు నీడను కూర్చున్నాడు. ఆ ప్రక్కనే పెద్ద చెరకుతోటఉంది గడలుబాగా ఎదిగి ఆకర్షణీయంగా ఉన్నాయి. శిష్యులకు నోరూరింది. అడిగారు "స్వామీ! తోట యజమాని లేడల్లేఉంది తలా ఒక చెరకుగడ విరుకుతిందామా ! ఆంతగా యజమాని వస్తే, డబ్బు ఇచ్చేద్దాం. లేదంటే, అతనికి మహా పుణ్యం వస్తుంది. సాధువులు తింటే పోయేదేముంటుంది గనక ! " గురువుగారు వద్దన్నా వినే స్థితిలో లేరు వారు. ఆయన 'ఊ' కొట్టి ఊరుకున్నాడు. శిష్యులు పరిగెత్తి, గడలు విరచి తలొకటి తీసుకొని, ఒక గడ గురువుగారికికూడ తెచ్చి ఇచ్చారు రామదాసు ఆ గడను తినక, చేతిలో పట్టుకుని కూర్చున్నాడు. అంతవరకు తోటకు కాపలా కచి, ఇంటికి భోజనానికి వెళ్ళిన యజమాని రానే వచ్చాడు. దూరం నుండే చూచాడు దృశ్యాన్ని. వాని కడుపు మండింది. అరికాలిమంట నెత్తికెక్కింది. ఆగ్రహోదగ్రుడై, ముందు వెనుకలు చూడక, సమర్థ రామదాసు చేతిలోని చెరుకుగడను దొరకపుచ్చుకుని, అందరికి ఫెడీ ఫెడీమని వీపులు పగిలేటట్లు వడ్డించాడు. వారేదో చెప్పబోతారు, అతడు వినిపించుకోడు. చివరకు సంత్ రామదాసును కూడ వదలలేదు వాడు.

వాడి బారి నుండి ఎలాగో బయటపడి, సాయంత్రానికి శివాజీ భవనానికి చేరారు. కాళ్ళకు పాంకోళ్ళు, చంకలో యోగదండం, ఎడమ చంకకు జోలె, కుడిచేతిలో జపమాల, కలిగి, భవ్యమూర్తిగా వెలుగొందుచున్న శ్రీ సమర్థులు, రాజభవనంముందు నిలచి " జై ! జై ! రఘువీర సమర్థ" అని గర్జించాడు. శివాజీ పరుగు పరుగున వచ్చి, గురుదేవునికి నమస్కరించాడు. వారి చంకలో జోలెలో ఒక 'రాగి రేకు'ను భిక్షగా వడేసాడు

" గురుదేవా ! నేను, నా కుటుంబం, నా రాజ్యం సమస్తం మీ ఆధీనం చేస్తున్నాను మీకు సమర్పిస్తున్నాను అని ఉన్నది ఆ రేకుపై. చివర 'శివ' అని సంతకం ఉంది.

" నాయనా ! ఇదేమిటి ? " అడిగాడు సమర్థుడు.

" స్వామీ ! ఇది కూడ మీ ప్రేరణే " అన్నాడు శివాజీ

" సరే ! అటులే కానీ ! రాజ్యము నాది. పాలించే ప్రతినిధి నీవు రాజ్యము నీది అనుకోకు. గురువుదనే

అప్పుడే తన మరాఠ్వాడా రాజ్యానికి " భాగవా (కాషాయరంగు) జెండా, యీ సంఘటనకు గుర్తుగా ఎగర వేయించాడు శివాజీ.

దూరభారం నుండి వచ్చిన గురువుగారికి స్నానోప చారం శివాజీ స్వయంగా నిర్వహించాడు స్నానం చేయిస్తున్నప్పుడు వీపుపై తేలిఉన్న 'వాతలు' చూచాడు కంగారు పడ్డారు. శిష్యులను పిలచి వాకబు చేసాడు అవకాశం దొరికిందిగదా అని వారు జరిగింది పూస గుచ్చినట్లు చెప్పారు. " మహారాజా ! ఆకలితో ఉన్నామేమో ! నాలుగుగడలు విరిచితిన్నాము. ఆ తోట యజమాని, చిన్న, పెద్ద, తారతమ్యం లేకుండా, అందరిని గొడ్డును బాదినట్లు బాదాడు శ్రీవారిని కూడా వదలలేదు ప్రాణాల మీద ఆశ వదలుకున్నాము. ఎలాగో బయటపడ్డాము, మీ రాజ్యంలో కూడా ఇంత అన్యాయమా ! ప్రభూ ! " అన్నారు వాళ్ళు

శివాజీ చాలా దుఃఖపడి, మరునాడు, మంత్రులు, సామంతులతో దర్బారు తీర్చాడు కొలువు కిట, కిట లాడిపోతుంది. సమర్థరామదాసు, రాజసింహాసనంపై ఆసీనులయ్యారు. పాదాల వద్ద శివాజీ కుర్చున్నాడు రక్షక భటులు చెరుకుతోట యజమానిని ప్రవేశపెట్టారు ఎదురుగా సింహాసనంపై, క్రిందటి రోజు తనతో దెబ్బలుతిన్న స్వామి కూర్చోటం చూడగానే, వాని పై ప్రాణాలు పైనే పోయాయి చేతులు కట్టుకుని భయంతో వణికిపోతూ నిలబడ్డాడు శివాజీ. " గురునాథా ! " ఇతడే నిన్న మీకు మహాపచారం చేసిన ద్రోహి ఏమి శిక్షో శెలవియ్యండి".

రామదాసు : " శివా ! ఇతడు తన తోటకు సాలీనా ఎంతపన్ను చెల్లిస్తున్నాడు ? " —

శివాజీ : " యాభైరూపాయలు "

రామదాసు : " సరే ! ఇప్పటినుండి, పూర్తిగా శిస్తు మాఫీతో ఇతడు, తన వంశపారంపర్యంగాశాశ్వతంగా దానిని అనుభవించ వచ్చు " - అన్నారు సభ స్తబ్దమై పోయింది సమర్థుని యొక్క క్షమకు ఇదే నిదర్శనం.

## చివరిఘడియలు :

1680 సం॥ లో ఛత్రపతి శి. మహారాజ్ మరణించారు. అది రామదాసుకు భరింపరాని కష్టమ యింది. వారసుడుగా సింహాసనమెక్కిన ' శంభాజీ ' విలాసలోలుడై దుష్పరిపాలన సాగించాడు. ఇది విన్న సమర్థరామదాసు అతనికి సుదీర్ఘ లేఖ వ్రాసి, బాధ్యతలు తెలిపి, అతని కళ్ళుతెరిపించి, మంచిమార్గానికితెచ్చాడు.

రామదాసు ఆయుద్దాయం చరమ దశకుచేరింది. చివరి కోరికగా, తంజావూరు నుండి తెప్పించిన, అందమైన శ్రీరాముని విగ్రహాన్ని సజ్జనగడ్‌లో నిర్మించిన దేవాలయంలో ప్రతిష్ఠించాడు 150 సం॥ల పూర్ణ జీవితాన్ని సార్థకంగా గడిపి, 1882 సం॥లో మాఘ బహుళ నవమినాడు శరీరాన్ని వదలి శ్రీరామునిలో లీనమైనాడు ఆ

## సమర్థరాముని బందరు రాక

ఇక్కడ ఒక ముఖ్యవిషయాన్ని ప్రస్తావించాలి. సమర్థరామదాసు దేశపర్యటనలో ఉన్నప్పుడు అనేక చోట్ల హనుమవిగ్రహాలను ప్రతిష్ఠించాడు తావీలఖానాలు నెలకొల్పాడు ఆ వరుసలోనే బందరుకు విచ్చేసి బ్రెంచిపేటలోని శ్రీ ఆంజనేయస్వామి విగ్రహాన్ని వారి చేతులు మీదుగా ప్రతిష్ఠించటం, పట్టణ వాసులమైన మన అందరి అదృష్టం. ఈ విషయాన్ని 25 సంవత్సరాల క్రితం, యీ పట్టణానికి విచ్చేసిన శ్రీ కంచి కామకోటి పీఠాధీశ్వరులు, పెద్ద స్వామిలవారు, శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామీవారు ఒక రాత్రి శిథిలావస్థలో ఉన్న ఆ దేవాలయ ప్రాంగణంలో నిద్రించి ఉదయాన వారిని సందర్శించిన భక్తులకు దివ్యజ్ఞానదృష్టితో తెలుసుకొని వివరించారు ఆకారణంగా అప్పటి వరకు నిర్లక్ష్యం చేయబడిన ఆ దేవాలయం అనతి కాలంలో పునర్నిర్మింప బడి, యీనాడు అత్యంతశోభయమానంగా ఉంది.

## మనలో మాట

సమర్థరామదాసు సిద్ధిపొందిన ఈ మాఘబహుళంలో, పుట్టిన శ్రీరామునవమి దగ్గరలో రానుండగా, ఇంతటి మహోన్నత వ్యక్తి జీవితవిశేషాలను వివరిస్తూ వ్యాసం వ్రాసే అవకాశం, నాకు లభ్యమయినందుకు మహదానంద భరితుడనవుతున్నాను.



# కొమరగిరి కారాగార లేఖలు

(గత సంచిక తరువాయి)

సెంట్రల్ జైలు, రాజమండ్రి
ది. 23-11-76

ప్రియమైన జయ,

నేను కులాసా నీవు మరియు మన పిల్లలు వ్రాసిన ఉత్తరాలు అందినాయి. పిలకా గణపతి కూడా వ్రాసినందుకు చాలా సంతోషం, పిల్లల రైటింగ్ విషయంలో శ్రద్ధ వహించాలి. ఇప్పుడు మంచిగా వ్రాయటం రాకపోతే ముందు ముందు అసలేరాదు నా ఉత్తరాలలోని భాష విషయం వ్రాసావు. స్థాయి తగ్గాలంటే కొంచెం ఇబ్బందిగానే ఉన్నది ఇది భవిష్యత్తు వారికి ఉపయోగపడే విలువైనా ఉత్తరాలని నా అభిప్రాయం. కనుక పిల్లలకు విడమరచి చెప్పాలి పిల్లలకే కాదు చాలా మంది ఉపాధ్యాయులకు కూడా నేను వ్రాసే విషయాలు తెలియవు వాళ్ళు కూడా తెలుసుకోవలసిన విషయాలున్నాయని నా అభిప్రాయం విషయం యొక్క ప్రాముఖ్యతను బట్టి భాష ఉండాలి పిల్లలు కూడా అర్థం చేసుకోవాలనే ఉద్దేశ్యంతో సరళంగానే వ్రాస్తున్నాను వాళ్ళు చదివేది చిన్న తరగతులే గదా ! అర్థం కావటం కొంచం కష్టమే. కనుక పెద్దలే పిల్లలకు వివరించాలి అనేక పుస్తకములలోని నీతి శ్లోకములను తీసుకొని ఆలోచించి వ్రాస్తున్నాను శ్లోకము, అర్థము పుస్తకము లోనివి. మిగతా వ్యాఖ్య అంతా నా స్వంతం. భగవదనుగ్రహం వలన అనుకోకుండా ఊహించనటువంటి విశ్రాంతి లభించింది ఇటువంటి కారాగార ప్రాప్తి బాధాకరమే అయినప్పటికీ, దానిని సద్వినియోగం చేసుకోవటం విజ్ఞత లక్షణం కదా ! అందువలన ఈ కాలమును వృధాపరచక సద్వినియోగం చేయటానికి కృషిచేస్తున్నాను. కలం దానంతట అదేసాగిపోతున్నది ఒక భావం తరువాత మరొక నూతన భావం కలుగుతున్నది వ్రాస్తున్నాను. భావం కలిపించేది, వ్రాయించేది ఆ పరమేశ్వరుడే నని నా నమ్మకం. మనం నిమిత్తమాత్రులమే నని నా విశ్వాసం. ఇక ఉంటా ......

చిరంజీవులకు - ఆశీస్సులు

మీ రందరూ నేను వ్రాసిన ప్రశ్నలకు సమాధానాలు వ్రాసినందుకు చాలా సంతోషం. విద్య యొక్క విశిష్ఠతను గురించి మరికొన్ని విషయాలు వ్రాస్తున్నాను సమస్త ద్రవ్యములలో విద్యయే ఉత్తమద్రవ్యమని ఈ క్రింది "హితోపదేశం" లోని శ్లోకము చాటుచున్నది.

"సర్వ ద్రవ్యేషు విద్యైవ
ద్రవ్యమాహురనుత్తమమ్
అహార్యత్వా దనర్ఘ్యత్వాత్
అక్షయత్వాచ్చ సర్వదా"

అనగా "ఎల్లప్పుడూ దొంగిలింప శక్యము కాని దగుటవలననూ, నాశనము కాని దగుటవలననూ. వెలకట్ట శక్యము కాని దగుటవలననూ, అన్ని ద్రవ్యములయందు విద్యయే గొప్పదైన ద్రవ్యముగా చెప్పుదురు" అని అర్థము

భౌతికమైన నగలు, మేడలు, పొలాలు మొదలగు సిరిసంపద కంటే విద్యాధనమే ఎన్నోరెట్లుమేలైనది. ఎందుకనగా విద్యాధనమును దొంగలు దొంగిలించలేరు. పనిగట్టుకొని నాశనం చేయటానికి వీలుకాదు. ఈవిద్య ధనమునకు విలువ ఎవ్వరూ కట్టలేరు. అటువంటి వెల లేని అమూల్యమైన ఈవిద్యాధనమును పొందినవారు నిజంగా ఎంతో అదృష్టవంతులు అట్టివారు పూర్వజన్మలో పుణ్యం చేసుకొని ఉంటారు

# సాయినాథ !

పలుకు పలుకు యందు పసిడివన్నెల తోట
నిగమసారంబంత నిలిపినావు.
చల్లని చిరుచూపు జల్లుచు భక్తులు
నెమ్మొఖమున హాయి నింపినావు.
అద్వైతభావాల ఆదర్శమూర్తిగ
మహిపైన నిండాగ మసలినావు
గూడుకట్టిన బాధ గుండెనందునిల్వ
చెలిమిన శాంతింప జేసినావు.
ఆ.వె ॥ సాయినాధ చాలు చాలుని రమ్యోక్తి
'కరుణ' కనికరమ్ము కల్గివున్న
దయన నన్ను జూడు 'దమ్ము' నీ కున్నను
నామదినవసింప నడిచిరమ్ము.

**వి. యల్. రాఘవరావు**

"అర్ధానా మార్జనే దుఃఖమ్'' ధనము సంపాదించుటయందు దుఃఖము కలుగుచున్నది ధనము విపరీతంగా అనగాఅవసరానికి మించి సంపాదించేవానికి సుఖమూ వుండదు, సౌఖ్యమూ వుండదు. మనశ్శాంతి అంతకన్నా వుండదు. తాను అనుభవించలేడు ఇతరులకు చూస్తూ, చూస్తూ ఇవ్వలేడు. అనుభవిస్తే అయిపోతుందేమోనని భయం దాచుకుంటే దొంగలు దోచుకొంటారేమోననే మనోవ్యధ, అటువంటివారికి నిద్దరేపట్టదు ఇనుపపెట్టెలో పెట్టి, గట్టితాళం వేసి వీలుంటే విద్యుచ్ఛక్తి కూడా దానికి అమర్చి, భవనం మధ్యలో ఆ పెట్టెను పెట్టి తలుపులు బిగించి, కాపలాకు "మూర్ఖా" ను పెట్టి కూడా ప్రశాంతంగా నిద్రపోడు ఆ యజమాని. ఇంత కట్టుదిట్టంచేసినా పోయే కాలం దాపురిస్తే దానిని ఎవ్వరూ ఆపలేరు. ఆ ధనము ఎవరికైనా అప్పుగాయిస్తే తిరిగి వచ్చిందాకా నమ్మకం లేదు నగలు చేయించుకుంటే దొంగలు దోచుకుంటా రేమోననేభయం అవి కూడా కొంతకాలనికి అరిగి విరిగి పోతాయి ఆ డబ్బు పెట్టి మేడలు, భవనాలు నిర్మిస్తే అవి కూడా శాశ్వతంకావు. అద్దెకు యిస్తే వాటిని సక్రమంగా చూడరేమోననే భయం. గాలివాన వస్తే అసలు కడేకదు అన్నట్టుగా భూకంపాలు, తుఫానులు వస్తే నేలమట్టమవుతాయి పొలాల మీద పెట్టుబడిపెడితే పంట ఇంటికి ఎచ్చిందాకా నమ్మకం లేదు దొంగలు దొంగిలించవచ్చు. అతివృష్టి అనావృష్టులకు గురియై పంటలు సర్వ నాశనం కావచ్చు. కనుక మానవుడు కక్కుర్తిపడి, అక్రమంగా, న్యాయమైన అవసరాలకు మించి సంపాదించిన భౌతిక సంపద శాశ్వతంగా మన జాలదనే విషయం జగద్వితమే. కనుక ఈ సమస్త ద్రవ్యములలో కెల్లా ఒక్క విద్యా ద్రవ్యమే శ్వాశత మైనది. దొంగలకు అసాధ్యమైనటువంటి, నశింపులేనటు వంటి, వెలలేని అమూల్యమైన ఈ విద్యాధనమును సంపాదించినవారికి మాత్రమే మనశ్శాంతి ఉంటుంది. అటువంటి వారికి ఎట్టి భయమూ ఉండదు. అట్టివారి జీవితమే సార్థకమవుతుంది. కనుక అటువంటి ఉత్తమమైన విద్యాధనమును ప్రతి ఒక్కరూ తనజీవిత కాలంలో సంపాదించి తీరాలి ముఖ్యంగా బాల్యదశయందే ఆర్జించాలి ఇదే సరియైన తరుణం. ఈ సదవకాశమును యిప్పుడు జారవిడచుకుంటే పెద్దవాళ్ళయిన తరువాత బాధపడవలసివస్తుంది. కనుక శ్రద్ధగా, ఓపికగా, పట్టుదలతో విద్యను మీరందరూ నేర్చుకోవాలని నా ఆకాంక్ష, నా ఆదేశం ఇక వుంటా ...

ఇట్లు
"మీ నాన్న"

( 8 వ పేజీ తరువాయి )

ఆత్మను తాను విశ్వసించటం లేదు. సంసారాన్ని విశ్వసిస్తున్నాడు అభిమానమమకారములను విశ్వసిస్తున్నాడు కనుకనే భయం వానిలో ప్రవేసించింది కనుక ఈ భయం యుండినంతవరకునూ, యీ దేహం ఉండినంతవరకునూ బ్రహ్మము చిక్కదు బ్రహ్మ తత్త్వాన్ని అర్థంచేసుకోలేడు. కారణం ? భ్రమ చేరిపోయింది భ్రమ ఉండినచోట బ్రహ్మ ఎక్కడ ఉంటాడు ? కనుక భ్రమనంతా బ్రహ్మగా మార్చుకోవాలి ఏ భ్రమ ? బ్రహ్మ భ్రమనే నీకు కావాలి. ఆ బ్రహ్మ భావన ఒక్కటి ఉంటే సర్వ బలములూ నీకు చేకూరుతాయి అటువంటి బలాన్ని సంపాదించుకోవాలి. తన యందున్న శివత్వమనేదానిని విశ్వసించాలి.

ప్రతి రాత్రి కూడనూ చీకటిగానే ఉంటుండాది చీకటిగా ఉండిన దానినే రాత్రి అని పిలుస్తాము. కాని ఈనాడు శివరాత్రి రాత్రికిని శివరాత్రికిని ఉండిన బేధమేమిటి ? దివ్యత్వాన్ని గుర్తించిన వానికి ప్రతి దినమూ శివరాత్రే లోకాన్ని విశ్వసించిన వానికి ప్రతిదినమూ రాత్రే. ఆ రాత్రి చీకటి ఈ రాత్రి వెలుగు. కనుక యీ వెలుగు చీకటులందే మానవుడు తికమకలవుతున్నాడు. మానవుడు తనయొక్క భౌతికమయిన తత్త్వాన్ని తాను గుర్తించుకోలేకపోతున్నాడు. అంతులేని ఆశలతో, అర్థంకాని ఆవేదనలతో, అప్రాప్త రూప ప్రాప్తికై ప్రాకులాడి, కేవలం నిరాశకు నిస్పృహకు గురి అయిన మానవులకు దిక్కులు చూపే చక్కని దీపికలే ఆధ్యాత్మిక జ్యోతులు. అటువంటి Light House లను మనం పట్టాలి ఆ యొక్క దివ్యమైన Light House యే భగవత్ నామము. అటువంటి నామము చేతనే నామిని పొందవచ్చు. ఎక్కడ ఉండినప్పటికినీ దైవాన్ని పట్టవచ్చు. నామము ముఖ్యము. కనుక భగవంతుని యొక్క దివ్యతత్త్వాన్ని మనయొక్క నామము. అనగా నామి యందే నామము ఇమిడి ఉంటుండాలి. కనుక అంగములోని సంఘము సంఘములోని జంగము, జంగములోని లింగము. అంగము అనగా మన దేహమే ఒక అంగము. దీనికి అంగమని ఎందుకు పేరు వచ్చింది ? ఈ దేహానికి కూడనూ కొన్ని అంగాలుంటున్నాయి చేతులు, కాళ్లు, తల, చెవులు, ముక్కు, కళ్ళు— ఇవన్నీ అంగాలే అన్ని అంగములతో కూడినదే దేహము. అన్ని దేహములతో కూడినదే సమాజము. కాబట్టి దేహములు సమాజమునకు అంగములు. సమాజము ప్రకృతికి అంగము. ప్రకృతి పరమాత్మకు అంగము. పరమాత్మని అంగము ప్రకృతి. ప్రకృతియొక్క అంగము సమాజము, సమాజముయొక్క అంగము మనిషి మనిషి యొక్క అంగము చేతులు, కాళ్ళు మొదలైనవి. కాబట్టి యీ ప్రపంచములో ఎక్కడ చూచినప్పటికినీ అంగాంగముల యొక్క దర్శనమే. కనుక యీ అంగము లోపల ఒక సంఘముంటుండాది ఎవరు యీ సంఘముయొక్క సభ్యులు ? ఇందు లోపల కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనే ఈ ఆరుగురు ఒక సంఘముగా ఏర్పడి ఉంటున్నారక్కడ. వీరు ఎప్పుడు చూచినాగాని ఒక కమిటీలు పెట్టుకొని ఒకరు కాదంటే, ఒకరు అవుననే యీ విధమైనటువంటి పోట్లాటలు జరుగుతుండాలి ఇదే యీ దేహములో ఉండిన సంఘము ఈ సంఘాన్ని చక్కగా పరిశీలనచేస్తుంటాడు జంగము. ఆ జంగమయే ఒక జీవుడు. ఈ జీవత్వములోనే ఉంటుండాలి లింగము. లింగమనగా " లీయతే, గమ్యతే ఇతిలింగః దీని మొదలేదో, కొనఏదో చెప్పటానికి వీలుకాదు. కనుక ఆద్యంతములు లేనిదే లింగము ఆ లింగతత్త్వమే ఆత్మ. కనుక ప్రతి దేహమందునూ ఆత్మ అనే లింగముంటుండాలి. లింగమనగా కేవలం ఒక పానుపట్టం కాని, లింగమని గాని మనం భావించరాదు. అది ఏది తలో, ఏది కాళ్ళో చెప్పటానికి వీలుకాదు. అనగా ఆద్యంతములు లేని స్వరూపమే లింగము అని. ఇటువంటి లింగతత్త్వము ప్రతి మానవుని యందూ ఉంటున్నది ఒక్క భారతీయులందే కాదు.

శివరాత్రి అంటే జాగరణ చేసి భగవత్ నామము స్మరించి, కేవలం ఉ ప వా స ము చేసి ఉండటము మాత్రమే శివరాత్రియొక్క పరమ లక్ష్యము కాదు. ఇవన్నీ కొన్ని ఉపాంగములుగా భావించుకొని చిన్న చిన్న మార్గముల ద్వారా ఏనాటికో మనం ఈ గమ్యం చేరతామని లక్ష్యం పెట్టుకున్నారు ఏనాటికో చేర కూడదు. నేటికే చేరాలి. Next rext అనేదే ఉండ కూడదు. అప్పటికప్పుడే. ఆ విధమైన సత్యాన్ని గుర్తింపచేసుకొనే నిమిత్తం శివరాత్రి ప్రారంభమైంది. కాని ఈనాడు పరమ లక్ష్యాన్ని విస్మరించి దివ్యమైన భావాన్ని విస్మరించి ప్రాకృతమైన భావాన్ని విశ్వసించి కాలము గడుపుతూవస్తున్నారు మానవులు ఇది ఏనాటి గమ్యమో! ఏనాటికి ధన్యమవుతుందో వారికే తెలియదు అట్టి విశ్వాసమే వాని యందు లేదు. అంటే విశ్వాసము లేదంటే వాని యందు శివుడు లేడు శివుడు లేకుండా పోవటానికి కారణం ఏమిటి? శ్రద్ధ అనే మహాశక్తి లేదక్కడ. ఆ పార్వతీ కూడా లేదు ఈ రెండూ లేని స్థితి మానవునియొక్క గతి కనుక శివశక్తులు లేనిది కాదు మానవత్వం. శివశక్త్యాత్మక స్వరూపమే మానవత్వం. అట్టి మానవత్వాన్ని ఈనాడు మనం గుర్తించాలి. ఈ మానవతా గుణములను మనం పోషించుకోవాలి. ఈ శ్రద్ధ జ్ఞానం అనే వాటిని తీసుకోవాలి. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తి ఇవే మనయొక్క నిజమైన విలువలు. యీ మూడే సత్యం, శివం, సుందరం. ఇవే దివ్యమైన శక్తులు. ఇలాంటి శక్తులను మానవునియందు ఉంచుకొని ఏదో చిల్లర బుద్ధులు, చిల్లర మార్గములు, చిల్లర పదార్థములు పొందటంకోసమని ప్రపంచంలో మనంవెదుకుతున్నాం.

“ కోరిన ఫలమిచ్చు కల్పవృక్షంబుండ
పెరటి పుష్పముకై ప్రీతియేల ?
అడిగిన పాలిచ్చు కామధేనువుండ
ధనమిచ్చి ఆవును కొనగనేల?
మండెడు కాంతితో మేలుపర్వతముండ
వెండి బంగారుకై వెతకనేల ?
భక్తి ముక్తుల నిచ్చెడి పరమాత్మ మేయుండ
వాడు సంసారము కోరనేల ? ”

సంసారమనగా భార్యా, భర్త పిల్లలు కాదు కూడ ఉచ్ఛ్వాస, నిశ్వాసములే సంసారము, ఈ బంధ మయిన జీవితమే సంసారము తలంపులే సంసారము. చర్యలే సంసారము, చేష్టలే సంసారము, [illegible] సంసారము, ఉద్యోగములే సంసారము, అన్నీ సంసార ములే. ఈ సంసారములోనే ఉంటుండాలి. సంసారము కొంచెమయిన సారమే యిది ఇది దీనియొక్క అంత రార్థము. దీనిని మనం ఎందుకు కోరాలి? పర్వతాల వంటి బంగారాన్ని చూచుకొని యీ చిన్న చిన్న నవరస్సులు, తులాలు మనం ఎందుకు ఆశించాలి? వీటి నంతా మనం ఆశించనక్కరలేదు కనుకనే మానవుడు ఆశించవలసినది భగవంతుడిని భగవంతుడు ఒక్కడు మన చేతికి చిక్కాడంటే సర్వమూ మన హస్తగతమై పోతాయి. భగవంతుని అనుగ్రహముంటుంటే సర్వ మునూ మనం సాధించగలము కనుక అట్టి దైవకృపను మనం సాధించాలి. దీనిని సాధించాలనుకుంటే మనలో నున్న రాగ భయ క్రోధములు పోవాలి మనం ఏ పని చేసినప్పటికినీ భగవంతుని కర్మగా భావించాలి భగవత్ భక్తిగా మనం విశ్వసించాలి. నీ పనిని నీవు వదల నక్కరలేదు నీ ఉద్యోగాలు నీవు చేసుకో, నీ సంసా రాలు నీవు చేసుకో. నీవు ఏ పని చేసినప్పటికినీ భగవత్ కార్యంగా భావించి చేయి. సర్వత్రా ఉన్నాడు భగవంతుడు ప్రపంచమే భగవత్స్వరూపము. ఈ విధమయిన భావాన్ని నీవు హృదయములో నీవు అభివృద్ధి పరచుకుంటే చింత అనేదే లోపల చేరడానికి అవకాశం ఉండదు. ప్రపంచం వేరు, నేను వేరు అనే భావమ్ము ఉండటం చేతనే నీకు చింతలు, దుఃఖములు విచార ములూ వెంటాడుతూ వస్తున్నాయి కనుక ఈ ఉపవాస ము కాని, జాగరణములు కాని లౌకికమయిన భావనతో

మీరు చేయకండి దివ్యమైన ఆత్మభావనతో చేయండి ఇంకా కొంతమంది యీ రాత్రికంతా మేలుకుంటే చాలా గొప్ప పుణ్యమట అని ఏహోరకంగా మేలుకోవడానికి ప్రయత్నం చేస్తారు. ఏమిటి యీ మేలుకోవటం? పేకాటలు ఆడుకుంటూ మేలుకోవడమా? రెండుమూడు నాళ్లు సినిమాలు చూచి మేల్కొనడమా? ఇదియా జాగరణ? కాదు కాదు.

పేకాట లాడుచు ప్రీతితో ఆ రాత్రి
గడిపినందుకే జాగారమగునా!
చేపల కొరకునై చెరువులో జాలర్లు
పొంచి చూచెడి దృష్టి భక్తిగగునా!
తప్పసారాయి త్రాగి తన మేను
మరచిన మాత్రాన తన్మయత్వమగునా!
భార్యపై అలిగి పస్తుపరుండిన
అది గొప్ప ఉపవాసమగునా!

అవి ఉపవాసము కాదు ఉప అనగా సమీపము వాసము అనగా నివాసము ఎవరికి నివాసము? భగవంతునికి సమీపములో నివాసము, అది ఉపవాసము ఇలాంటి పవిత్రమయిన అంతర్భావములను యీనాడు విస్మరించి కేవలం బాహ్యమైన వాటినే ఆడంబరాలుగా ఆచరించి మనల్ని భగవంతుడు అనుగ్రహించలేదే! అనుగ్రహించలేదే! అని భగవంతుని ద్వేషిస్తున్నాము. 'యత్ భావం తత్ భవతి' మనయొక్క ఫలితము లన్నీ మనయొక్క కర్మలయందే ఉంటున్నాయి. భగవంతుని యొక్క అనుగ్రహము మనం చేసే కర్మల యందే ఇమిడి ఉన్నాయి. అప్పటికప్పుడే మనం నిర్ణయం చేసికోవచ్చు. నేను ఆడంబరముగా చేశానా? ఆత్మరక్షణతో చేశానా? పూర్ణవిశ్వాసంతో చేశానా? తనకు తాను పరిశీలన చేసుకుంటే అప్పటికే నిలుస్తుంది దానియొక్క ఫలితం. కనుక మనం Experience (అనుభవం) కావాలని అనుకుంటున్నాము కాదు ఇది Experimental (పరిశోధన) తో వచ్చే Experience (అనుభవం) కాదు అది Experimental Knowledge (పరిశుద్ధ జ్ఞానం). ఇది Experience knowledge (అనుభవ జ్ఞానం). కనుక ఈ Experience knowledge ఎట్లా పొందాలంటే మన భావం తోటే experience కావాలి మరొకటి సాధ్యంగా మనం తీసుకోనక్కరలేదు.

అనేకమంది భగవంతుని పొందటానికి ప్రాణాయామం చేస్తూ ఉంటారు. ప్రాణాయామము అనగా రేచకము, పూరకము, కుంభకము గాలిని వదలటమే రేచకము గాలిని తీసుకోవటమే పూరకము. దానిని నిలబెట్టడమే కుంభకం. ఇవి సహజంగా జరుగుతూనే ఉన్నాయి కదా! గాలిని వదలటము— గాలిని తీసుకోవటము ఈ రెండింటికి Interwel Time లో దాన్ని నిలుపుకోవటము ఇది సాధారణ సాధనే కదా! అది కాదు సాధన! మనము వదలవలసినది గాలిని కాదు. మనలో ఉండినటువంటి దుర్గుణములు, దుర్భావనలు, దుశ్చింతనలు మనం వదలాలి. అదియే రేచకము. పవిత్రమయిన భావాలు, పుణ్యభావాలు మనం తీసుకోవాలి అదియే పూరకము తీసుకున్నటువంటి మంచి భావాలు మనం నిలుపుకోవాలి అదియే కుంభకం. ఇదియే రేచకము, పూరకము, కుంభకము లలో ఉండినటువంటి అంతరార్థములు ఈ అంతరార్థం మనకి అక్కరలేదు.

'సో' తీసుకోవటం 'హం' వదలటము. ఇదియేనా మనయొక్క సాధన ఇది అందరూ చేస్తున్నటువంటి సాధనే నీ సాధనలో ప్రత్యేకత ఏమిటుండాలి? కనుక 'సోహం'తత్త్వములోనే ఉంటుండాలి దివ్యత్వం. సో...హం..., సో...హం... "సో" అనగా తత్. "తత్" అనగా భగవంతుడు. హం అనగా నేను. సోహం అనగా ఆ భగవంతుడే నేను. ఆ భగవంతుడే నేను...ఆ భగవంతుడే నేను...ఇదే నిజమయిన సోహం తత్త్వము. నేనే భగవంతుడను, నేనే భగవంతుడను అని దినమునకు 21,600 పర్యాయములు అని అంతర్భావము నీకు బోధిస్తుండాలి, దీనిని

లక్ష్యము చేయకుండా, కేవలం పుస్తకాలు పెట్టుకొని ఊరికే చదువుతుంటారు. ఈ పెద్ద పెద్ద పుస్తకాలు మనకు నిద్ర వచ్చేటప్పుడు తలక్రింద పెట్టుకోవటానికి పనికివస్తాయి కాని తల లోపల పెట్టుకోటానికిపనికిరావు కనుక ఈ సాధన అనేది Bookkish knowledge (పుస్తక జ్ఞానం) కాదు. ఇది విద్యావిధానంతో లభించేది కాదు దైవంయొక్క అనుగ్రహంతోలభించేటటువంటిది అంతర్దృష్టిని మనం సాధించుకోవాలి. ఈ సర్వ సాధనలు చేసిన దేహం కూడనూ ఏనాడో కూలి పోతుంది. అనిత్యమైన దేహంతో సంపాదించింది అనిత్యమే కాని సత్యము కాదు శ్రద్ధ విశ్వాసంతో సాధించినది శాశ్వతమైనటువంటివి కనుక భగవంతుని యొక్క తత్త్వాన్ని ఎక్కడో మనం వెతకనక్కర లేదు మనలోనే ఉంటున్నది. మనమే దైవత్వంగా భావించుకోవాలి నేను దైవము, దైవము అని నీవు భావించుకున్నప్పుడు నీవు దుర్గుణములలో ఏమాత్రమూ ప్రవేశించవు. నీవు ఏనాడు కూడనూ దుష్కర్మలు చేయవు కనుకనే అట్టి దుశ్చర్యలలో పాల్గొనకుండా దుర్భావములు ప్రవేశించకుండా,ఉండాలనుకుంటే నేనే. దైవం ! నేనే దైవం ! I am God, I am God ఈ విధమైన భావములు పెంచుకొంటే తప్పక నీవు ధన్యుడవవుతావు దీనినే "బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి" ఆ సత్యాన్ని తెలుసుకున్నవాడు తానే సత్య స్వరూపుడై పోతాడు.

ప్రేమస్వరూపులారా ! ఈనాడు మనం యిట్టి పవిత్రమైనట్టి దివ్యభావాల్ని మనం పొందలేక పోవటానికి గల కారణం ఏమిటో గుర్తించాలి మనదాన్ని మనం అనుభవించటంలేదు దానిని ప్రక్కకు నెట్టి పరులదాన్ని అనుభవించటానికి ప్రయత్నిస్తున్నాం అనవసరంగా యితరుల వద్దకుపోయి గంటల తరబడి మాట్లాడుతున్నాం. మీ కాలాన్ని అపవిత్రం చేసు కొంటున్నావు, ఎదుటి వ్యక్తి కాలాన్ని దోచుకుంటు న్నావు కనుక ఎదుటి వ్యక్తితో నీవు అధికంగా మాట్లాడి వాని కాలాన్ని వృథా చేయవద్దు కనుకనే ఆనాటి మహనీయులంతాకూడనూ ఏకాంతమయిన అరణ్యాలకు వెళ్ళి మౌనాన్ని వహించేవారు. కనుక అధికంగా మాట్లాడకండి మీ కాలాన్ని వ్యర్థం చేసుకో వద్దు పరుల కాలాన్ని దోచుకోవద్దు. పరుల విషయములో నీవు ఏమాత్రం కూడా ప్రవేశించవద్దు నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు చేతనయితే సహాయము చేయి. అంతేకాని అనవసరంగా ఇతరులలో ప్రవేశించి వారి కాలమును, వారి సొత్తును, వారి ధనమును, అపహరించ ప్రయత్నం చేయవద్దు ఈనాడు ప్రపంచములో అన్ని రంగముల యందునూ అనవసరమైన Interference (జోక్యం) ఎక్కువైంది. ఎవరి దాంట్లో ఎవరునూ ప్రవేశించకూడదు. నీపని నీవు చూచుకో, నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించుకో. నీవు కర్తవ్యాన్ని నిర్వర్తించు కొనే నిమిత్తం పుట్టావు కాని, Right ను సంపాదించు కోవటానికి పుట్టలేదు. "కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన" కర్మాచరణ కోసమే పుట్టావు. అదియే నీ అధికారం అంతేకాని యీ కర్మఫలం ఎప్పుడు వస్తుందని దానిపై నీవు దృష్టి పెట్టుకోకూడదు. కనుక నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించు. అదియే నిజ నిజమైన ధర్మము ధర్మమంటే ప్రత్యేకించినది కాదు. ఆధ్యాత్మికము అనేది వ్యక్తిగతానికి సంబంధించింది. ధర్మము సమిష్టికి సంబంధించినది. ఇది పెద్ద సముద్రం వంటిది Spirituality (ఆధ్యాత్మికము) అనేది చిన్న కొలను వంటిది దీనికి దానికి మనం అంటగట్ట కూడదు ఈ కొలనులోని నీరుకూడనూ సముద్రందే ఈ సత్యాన్ని మానవుడు గుర్తించటంలేదు కనుక వ్యక్తిగతములో ప్రారంభమయి, వ్యక్తిగా జీవించి, సమిష్టిలో లీనం అయిపోవాలి. ఇదియే నిజమయిన దివ్యత్వము అదే ఆధ్యాత్మికము. ఇదే సాయుజ్యము. ఈ సాయి తత్త్వాన్ని నిరంతరం కూడనూ మానవుడు చింతించాలి. ఈనాడు భౌతికంగా చూచినప్పుడు భగవంతుడు షోడశ కళాపరిపూర్ణుడు అని, కాని మనకు కూడనూ పోషకశక్తులు ఉంటున్నాయి. 16 కళలు

ఉంటున్నాయి. ఈ చతుర్దశి దినము. 15 కళలు లీనమై ఒక్క కళ మాత్రమే ఉంటుండాలి. కనుకనే ఈనాడు రాత్రి ఏవిధంగా స్మరించినప్పటికినీ దీనిని అందులో లీనం అయిపోవడానికి అవకాశము, అతి సమీపంలో ఉంటున్నాము. కనుక మన జీవితములో సంవత్సరమునకు ఒక్క రాత్రి అయినా కూడనూ నిశ్చలచిత్తుడై భగవంతుని స్మరించడం ఎంతో నోచుకోవాలి. కనుక ఈ ఒక్క రాత్రి అయినా కూడనూ ఏ చింతలు చేయక సర్వ చింతలు కట్టగట్టి ప్రక్కన పెట్టి దైవచింతనలో లీనం కావడానికి తగిన ప్రయత్నం చేయాలి

( ది. 19-2-1992 మహాశివరాత్రి పర్వదినమున భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు చేసిన దివ్య ప్రసంగం నుండి )



శ్రీ పరమహంస కథలు :

# నారదుని సంసార మోహము

మాయ ఇట్టిదని తెలియరానిది కదా !

ఒకనాడు నారదుడు శ్రీహరిని సమీపించి "స్వామీ" అసాధ్యమును సాధ్యముగా చేయు నీ మాయను నాకు చూపుము ! " అని వేడుకున్నాడు. శ్రీహరికి భక్తుల కోర్కెలు తీర్చుటయే పనికదా ! 'సరే' నన్నాడు

ఇరువురూ కలిసి పయనమయ్యారు. ఒకచోట శ్రీహరికి దాహమయింది. "నారదా ! కొంచెము నీరు తెమ్మ ! " అనెను శ్రీహరి కొరకై నారదుడు నీటి కోసం పరిగెత్తాడు.

చాలా దూరం పోగా ఒక ఏరు కన్పించింది. అచటికి పోగా ఒక సుందరాంగి కన్పించినది ఆమె సౌందర్యం చూసి నారదుడు మోజుపడ్డాడు ఆమె నారదుని పలుకరించినది ఇరువురూ ప్రేమించుకున్నారు పెండ్లి కూడా చేసుకున్నారు. వారికి సంతానం కూడా కలిగినవి.

వారి కుటుంబం మహదానందంగా గడుపుతుండగా, ఆ దేశమునకు కరువు వచ్చినది ఆ ప్రదేశము వీడి వెళ్ళుట మేలని భావించి, తన కుటుంబంతో వేరొక చోటికి వెడలుతూ ఒక వంతెన దాటవలసివచ్చినది

ఆ సమయమున ఆ నది పొంగి వరదగా మారి ఆ ప్రవాహములో నారదుని కుటుంబ సభ్యులెల్లరూ కొట్టుకొని పోయిరి దుఃఖపరవశుడై నారదుడు క్రిందపడి దొర్లుచూ ఏడ్చుచుండగా జగన్నాటక సూత్రధారి అతనిని సమీపించి "నారదా ! మంచినీరేది? నీవిటులేడ్చుచున్నావేమి అని పలకరించాడు. విషయం అర్థమయిన నారదుడు —

' ప్రభో ! నీకు పదివేల నమస్కారములు ! అత్యద్భుతమైన నీ మహా మాయకు కోటి నమస్కారములు ! ' అని శ్రీహరి కాళ్ళమీద పడ్డాడు.

* చూసారా ! మహా మాయకు లొంగనివారెవరు ?

# నూతన సంవత్సర శుభాకాంక్షలు

హనుమంతు వెంకట రమణారావు

సర్వసాధారణముగా సంవత్సర మొదటి దినమున ఎదురైన ప్రతి వారికి " నూతన సంవత్సర శుభాకాంక్షలు " లేదా " నవ వర్షకి శుభ కామనామే " లేదా " Happy new year " అని సంబోధించుకు పోతూ ఉంటాము ప్రత్యుత్తరముగ చేయి - చేయి కలుపుకుంటూ అది ఒక సభ్యతగా భావించి "Same to you" అని ముక్తసరిగా జవాబు చెప్పుకుపోతూ ఉంటాము. ఇక ఇంతటితో తన పని ముగిసిపోయిందన్న భావనతో రెండవ దినము ఆ మాటే మరచిపోతూ యున్నాము అంటే యాంత్రికంగా యథాస్థితికి వచ్చివేయుట ఒక ఆచారమై పోయినది.

కాని ఇది ఒక ఆచారమని చిలుక తన పలుకులను వల్లించుకుపోతూ యున్నట్లు ఒకరికొకరు శుభాకాంక్షలు చెప్పుకొనుట, చేయి - చేయి కలుపుకొనుట మరునటి దినము ఆ మాటే మరచిపోవుట సరిఅయిన పద్ధతి కాదు సుమా !

పలకవే చిలకా అని మరునటి దినము అంటే అదే మాట మరచిపోకుండా పలుకుతుంది ఆ చిలుక. మరి నరులమై యుండి మనమాచరించుచున్నది ఏమిటి ? " జంతూనాం నరజన్మ దుర్లభమ్ " అన్న సాయి వాక్కు వింటూనే యున్నాము. ఇట్టి పవిత్రమైన, దుర్లభమైన మానవ జన్మ యొక్క విశిష్టత " సన్న కథ " ప్రథమ భాగములో ఎంత చక్కగానో వివరించి యున్నారు. చదివి అనుష్ఠానములో ఉంచక పోవుట, సాయి మాటలు విని సాయి బాటలో నడవక పోవుట చాలా విచారకరముగా యున్నది

అసలు ఈ " శు భా కాం క్ష " చెప్పుకొనుటలోని అంతరార్థము ఏమిటి ? ఒకరి దృష్టి ఒకరిపై పడిన వెంటనే 'మనసా' అంటే మనస్సులోని భావన స్పందిస్తుంది ఆ స్పందించిన భావన "వాచా" అంటే వాక్కు ద్వారా తెలియపరచుకొనుట జరుగుచున్నది. ఈ క్రియ ఇంతటితో ఆగిపోవుచున్నది. "వాచా" ద్వారా వెలువడినది "కర్మణా" అంటే కార్యరూపములో జరుగుట లేదు ఈ కార్య రూపమును అనుష్ఠానమందుంచుకొనక పోవటమే మన దౌర్భాగ్యమైయున్నది. 'మనోవాక్కాయ కర్మలను ఏకంగా అనుష్ఠానమందుంచుకొనుటయే తపస్సు అని, దీనిలో ఏ ఒక్కటి తప్పినా త్రికరణ శుద్ధి చెడుతుంది " అని పదే - పదే స్వామివారు బోధిస్తూయున్నారు.

అలాంటప్పుడు నేటి శుభాకాంక్షలు అసంపూర్ణత్వముతో నిండియున్నదనుటలో సందేహము లేదు కదా! సుస్వాగతం అని చెప్పుకున్న నూతన సంవత్సరం పరిపూర్ణత చెందాలంటే వీడ్కోలు ఇస్తూ యున్న గత సంవత్సరములోని లోటుపాటులను నెమరువేసుకోవాలి

బాబా వచించిన ప్రకారము సంవత్సరానికి 3 కోట్ల 15 లక్షల 36 వేల సెకన్లు అనుకొందాము. అందులో ఎన్ని సెకన్లు పూజ్యభావముతో పెద్దలను గౌరవించాము? ఎన్ని సెకన్లు మాతా-పితురుల సేవకై వినియోగించాము? ఎన్ని సెకన్లు తప్పుడు పనులు చేస్తూ తలిదండ్రుల మనస్సులను క్షోభపరచాము? ఎన్ని సెకన్లు దైవచింతన సత్కర్మల కొరకు వినియోగపెట్టాము? ఎన్ని సెకన్లు దుష్టసాంగత్యము, దుర్మార్గ కార్యములలో పాల్గొన్నాము? ఎన్ని సెకన్లు సార హీన శృంగార దృశ్యములు తిలకించుటలో వ్యర్థపరచాము! ఎన్ని సెకన్లు విద్యాధ్యయనము కొరకు వినియోగించాము? ఎన్ని సెకన్లు నిద్రా

భోజనాదులలో వ్యయము చేశాము? అన్నది లెక్కించి చూసుకొంటే అనవసర, అవసర, అత్యవసర కాల వ్యయము తేలుతుంది. అత్యవసర పనులు ముందుగా చేయాలి. కాలము మిగిలినచో అవసర పనులలో ప్రవేశించాలి అనవసర కార్యములు ఎట్టి పరిస్థితిలో కూడా తలపెట్టరాదు రానున్న "రేపు" చూడగలము నడుస్తూయున్న "నేడు" చూచుచున్నాము. గతించిన "నిన్న" ఎన్నటికీ చూడజాలము. ఈ సత్యాన్ని ఎరుక పరుస్తూ స్వామి వారు " Dont last time " సమయము అమూల్యమైనది వృధా పనులలో వ్యయ పరచవద్దు అని చాటి చెప్పుచున్నారు.

ఇలా మనము మన గతించిన కాలయాపన పట్టిక లెక్కించి చూసుకొన్నచో మనలోని లోటుపాటులు మనకే విశదము అవుతాయి. ఆ జరిగిపోయిన లోటు పాటులు నూతన సంవత్సరములో సరిదిద్దుకోవాలన్న దే మన అందరి "ఆకాంక్ష" గా అయిఉండాలి అప్పుడే నేడు సభ్యతగా భావించి చెప్పుకొనుచున్న ' శుభా కాంక్షల ' కి పరిపూర్ణత్వం చేకూరుతుంది. ఆచరించుట మన ధర్మము. ధర్మమే స్వామివారి ఆచారము. 0 0 0

# శ్రీవాణి సాంస్కృతిక మాస పత్రిక

For IV (See Rule-8)

| | | |
|---|---|---|
| 1. | ప్రచురణ స్థలము | మచిలీపట్నము |
| 2. | ప్రచురణ ఎన్నాళ్ళకు | మాసమునకు |
| 3. | ముద్రాపకుని పేరు | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 4. | ప్రచురణకర్త పేరు | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 5. | సంపాదకుని పేరు | కొమరగిరి కృష్ణమోహనరావు |
| 6. | చిరునామా | 24-52, రామానాయుడు పేట, మచిలీపట్నం |
| 7. | ముద్రణాలయము | శ్రీవాణి ప్రింటర్స్ |
| 8. | భాగస్థులు | ఎవరూ లేరు |

కొమరగిరి కృష్ణమోహనరావు అనే నేను పై విషయములన్నియు యదార్థమని తెలుపుచున్నాను.

మచిలీపట్నం
ది 27-2-93

కొమరగిరి కృష్ణమోహనరావు

ప్రచురణకర్త సంతకం